భారతీయ ప్రపంచమా!

నీయందు

స్వాతంత్ర్యదీప్తులచే తేజరిల్లనున్న ప్రపంచమున భావిభారత
భాగ్యోదయమునకు హేతుభూతులైన పౌరులు గావలసిన

బాలబాలికలు

వికసింపకముందె వాడి వత్తలయి కాంతివంతముగాని
దురదృష్టకుసుమములు!

మాతృదేశదాస్యశృంఖలముల నుగ్గునూచానరించి,
ప్రకృతదేశౌన్నత్యమునకై బద్ధకంకణులై పాటుబడవలసిన

యువతీయువకులు

జీవితమధురమధుకణ మొక్కటేని చవిచూడని దుర్భర
దారిద్ర్యదవానలపీడిత శల్యావశిష్టులు!!

సౌఖ్యకరమగు సాంఘికజీవితమున కాదర్శపురుషులు,
జాతినేకముచేసి దేశదీప్తికి మార్గదర్శకులై మనవలసిన

వయోవృద్ధులు

సానుభూతి సహకారములులేక అలజడుల కాలవాలమైన
బహిరవాతావరణప్రభావముచే శాంతిసౌఖ్యవిదూరులు!!!




# మూఢనమ్మకములు ప్రాణాంతకములు

మూఢ నమ్మకములన తెలియని వారి కంటె వాని ప్రాబల్యమునకు లోఁబడియుండు వారే యెక్కువ. పేరుపెట్టి 'యిది మూఢ నమ్మకము బాబూ!' అన్నపు 'డిదేమిటి క్రొత్త'దని యచ్చెరు వందుదురేమో కాని గ్రుడ్డిగనమ్మి గోతులందు పడుచుండుట సాధారణమే. మూఢ నమ్మకమనగా, ఒక దానియందుగల సత్యమును, విజ్ఞాన సాహాయ్యమున నెఱుఁగుటకు సాధ్యముగాకనో, సాధ్యమయ్యు తాను గమనింపకనో, గమనించియు మొదటి యభిప్రాయమును విడువ జాలకనో, యవివేకముగనో, యొక విషయమునందు నమ్మకము గలిగియుండుట. ప్రతిదియు నిట్లుండునని నమ్మట మనుష్య స్వభావము. కాని దానిని విజ్ఞాన సాహాయ్యమున బరీక్షించుట యొప్పు. తనకది సాధ్యము గానిచో నెఱిఁగినవారల వినుటమంచిది. హేతువాదమున కెంతమాత్రము నిలుచు ననుటగూడ పరికి పదగినదే.

అభ్యుదయమును ఆనందమును, సౌఖ్యములనుగోరి సర్వకాల సర్వావస్థలందును పాటుపడుచుండుట మానవుని ప్రకృతి. జీవితములో నాతడేమిచేసినను యీయుద్దేశ్య మంతర్భూతమై యుండకపోదు. ఎంతటి యవివేకముతో గూడిన గ్రుడ్డి నమ్మకములు గలవాడైనను, ఏదో యొక విధముగ తన యభ్యుదయమును గాంక్షించియే యుండుననుట నిర్వివాదాంశము. కాని తన

నమ్మక మట్టి యభ్యుదయమునకు తోడ్పడక యాటంకము గలిగించునను సంగతి యాతని మనోపీథిని పొడసూపునంతవఱ కా నమ్మకము వీడఁడు. ఒకవేళ తనకుఁ గలిగిన నష్టకష్టను లానమ్మకవలననే కలిగినవని యాతఁడెఱుంగకపోయినను, దానిని స్పష్టముగా, దెలిసిన యితరులు వానికి తెలుపవలసియుండును.

విద్యవ్యాపింపకమున్ను, విజ్ఞానము మానవుని కండయై పరిణామమును పక్వముగావింపక మున్నట్టి నమ్మకము లందఱికి నుండినవే. ఈరెండింటి వ్యాప్తివలన వాని ప్రాబల్యము ప్రపంచమునందంతయు దగ్గుచు వచ్చినవి. కాని భారత దేశమందింకను వాని ప్రాబల్యము తగ్గలేదు. ఇంకను వింతగొలుపు విషయమేమన, విద్యావంతులైన విజ్ఞానయుతులుకూడ యిట్టి నమ్మకములు కలిగియుండుటయు, తరుల మూఢనమ్మకముల యెడ నుపేక్షవహించుటయునై యున్నది. ఈ గుణము స్త్రీలయందమితముగ నున్నదన్నవారు కినియకుందురుగాక. నాగరికత యింత యభివృద్ధిజెందిన నేఁడు, మూఢనమ్మకములందెంత మాత్రము స్త్రీలు మక్కువ పీడకుండుట వారి యభ్యుదయమునకంత రాయము కలిగించును. ఈమాట నిజము. అంతియగాదు. ఇట్టి నమ్మకములవలననే ప్రత్యక్షముగ కీకడులుగుట కనఁబడుచున్నది. ప్రజాభ్యుదయమునకై ప్రభుత్వసహాయమున చేయఁబడు సౌకర్యములుకూడ యీమూఢనమ్మకములవలన నిరుపయోగములై పోవుచున్న నెవరికైన హృదయము కంపింపక మానదు. దీని కుదాహరణముగ కాలికట్ సమీపమున జరిగిన యీ విషాదవిషయమును దిలకింపుఁడు.

మాలప్పరము కాలికట్టునకు చాలదూరముగాదు. అది పెద్దబస్తీ కాకపోయినను కుగ్రామముమాత్రము కాదు. ఆయూర పదునారేండ్ల మాపలాయువతికి ప్రసవవేదనలు ప్రారంభమైనవట. ఆమె దురదృష్టవశాత్తున అది సుఖప్రసవముగాక ఆరు అహోరాత్రములాయమ యమయాతనతో గడిపినది. ఆ యింటఁగల యితర స్త్రీ లదియంతయు జూచుచుండియు నొక మంత్రసానిని (Mid-wife) దీసికొనివచ్చుట కంగీకరింపరైరి. ఆరవదినము, చుట్టుపట్లగల పురుషు లొక మంత్రసానిని దీసికొనివచ్చి బలవంతపెట్టి యువతిని చూడమనిరి. ఆమె ఆయువతిని పరీక్షించి, వెంటనే యొకడాక్టరును పిలిపింపవలసిన యావశ్యకతగలదని తెలిపినది. అంతియగాక ఆమె బంధువులతో, వెంటనే డాక్టరును పిలిపింపనిచో గర్భమందే శిశువు మరణించుననియు, తరువాత తల్లిప్రాణమునకుగూడ ముప్పుతప్పదనియు, నొక్కిచెప్పెను. ఏమిచెప్పిననేమి? ఆమెబంధువులు డాక్టరును పిలిపించుటకు ఒప్పుకొనరైరి. ఎందుకనగా వారి 'తంగల్ సాహెబ్' నీటిలో నొకమొగ్గను వేసియుంచెనట. అది యెపుడు వికసించునో ఆక్షణామే చావుమరణములమధ్య నల్లాడుచున్న యువతి సుఖప్రసవమగునట. ఇంతలో అవసరమెందుకు. ఇది వారి నమ్మకము! వారి వాదము !!

ఆరవదినము గడచినది. 'తంగల్ సాహెబ్' నీటవేసిన మొగ్గ చక్కగ వికసించినది. కాని ఆ యువతిస్థితి ఇసుమంతైన బాగుపడినదికాదు. ఏడవదినమున, నీఘోరమును విని భరింపనివారు డాక్టరును దీసికొనివచ్చి ఆయువతిని చూడమనిరి. ఆతడరుదెంచునప్పటికే, గర్భమునందు శిశువు గతించియుండెను. తల్లికి మైకముగ్రమ్మి తానుగూడ శిశువు ననుసరించు నటులుండెను. కాని ఆసమయములోనైన ఆబంధువులు యువతిని తాకనిచ్చినవారు గారు. డాక్టరు నయమున భయమున యువతిచచ్చుచున్నదని చెప్పినను వారువినక యాటంకపెట్టుటచే వదనము వాలవైచుకొని వచ్చిన త్రోవనే మరలవలసివచ్చెను. ఆయువతియు నీ ఘోరయాతననుండి దప్పించుకొని పరలోకమున కేగెను.

ఇది కట్టుకథగాదు, కల్పనగాదు; యథార్థముగ జరిగినసంగతి. ఇట్టివెన్నియో మూఢనమ్మకములు తమ్మావేశింప నుండెడి స్త్రీపురుషులు దీని కేమిజవాబు చెప్పెదరు? 'వారికర్మ వారి'దని తమ తెలివితక్కువను, అవివేకమును, వెఱ్ఱివేదాంతములకు గట్టివైచి ప్రాణుల కెనలేని యాతనగల్పించి మృతులగుటకు కారకులగుదురా? ఇది యొకటియే గాదు. మూఢనమ్మకములు గలచోటులందెల్ల నిట్టిబాధలు కొంచెమో గొప్పగనో తలచూపకపోవు. వాని కితరకారణములని యూహించుచు తమ మూఢనమ్మకముల పీషకయుండువారికే వానివలనగలుగు చెడుగులను బోధింపవలసిన యావశ్యతగలదు.

విద్యావతులై, విజ్ఞానము నార్జింపగలిగిన నారీమణు లిట్టి మూఢవిశ్వాసముల కూకటివేరులతో పెకలింపవలయును. నారీలోకమే మూఢవిశ్వాసముల నెక్కువగా నాదరించున నెడు మాటలను బూటకమని నిరూపింపవలయును. ముఖ్యముగా పత్రికలజదువుచు నందిట్టి సంగతులను చూచినపు డంతయు, విద్యాగంధములేని తోడిసోదరులకు వీనిని గూర్చి నచ్చునటుల హేతువాదములచే చెప్పి వారికున్న గుడ్డినమ్మకముల దొలగింప ప్రార్థితులు.

---

## కోయిలకంఠము

బులుసు వెంకటేశ్వరులుగారు

గీ॥ మంద మలయానిలమ్మున మలయుచలువ
కచ్ఛపీతంత్రులఁ జలించు క్రమలాస్య
మమర మందారమందలి యమృతమధువు
నీమెలుగులోన సోనలౌ కోయిలమ్మ!

# మంగళగౌరి

శ్రీమతి చిలకపాటి సీతాంబగారు

శ్రీకరమై యతులితశో, భాశరమై వరదమై యనంతయశశ్రీ
కాకరమై మంగళగౌ, రీకమనీయ వ్రతములరేఁ సాకరమై.

అలరెడి శ్రావణంబున మహానియతిన్ కుజవాసరంబునన్
సులలితగీతవాద్యములు చొప్పడ మంగళగౌరి గొల్చుమం
గళవతు లాయువుల్ సిరులుగల్గి నిరంతరమాత్మసంతతుల్
యిలనభివృద్ధినొంద సుఖయించెద రైదువులై ముదంబునన్.

గౌరినిపూజింపగా మంగళస్నాన మాచరించిన యంతనభములుడుగు
జగదేకపూజ్యయా శంకరినర్చింప, చెలుల కభీష్టసంసిద్ధులొదవు
కేలదోరంబును గీలింప నిత్యశోభన భాగ్యభోగవైభవములెసగు
కన్నుల కొండవంటికాటుకనలరింప విజ్ఞానసంపదల్ వెలయుచుండు
జ్యోతులనునిల్పి మంగళగీతికలను, నెలమిబాడుచు వాయినంబులనొసంగు
నట్టి మంగళవతులు సౌఖ్యానుభూతి, నలరి సుఖయింత్రు జగతిపై
యహరహములు.

మునుసత్యవతియనంబడు, మను జేశునిపట్టి దానమంగళవతిగా
మనునట్టె?ఘూనీలగ్నం,బున జననమునొందెగురులు పొక్కఁగ నెపుడున్.

ఐదువులేని యామగువ యాయువులేనివరున్ వరించి దా
ఖేదమునొందబోవక యకిల్బిషభక్తిని శాస్త్రపద్ధతిన్
సాదరమొప్ప నార్యజనసమ్మతి మంగళగౌరిగొల్చి సు
శ్రీదనరార నిష్టఫలసిద్ధియు నిత్యసుమంగలీత్వ భా
గ్యోదయమంది వర్ధిలె శుభోన్నతులన్ బతితో ముదంబునన్.

# మనసులో మాటలు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

## స్వరాజ్య స్వరూపం

స్వరాజ్యం స్వరాజ్యం అని యిన్నాళ్ల నుంచీ కాంగ్రెసు వారు అంటూవుంటే స్వరాజ్యమంటే యెట్లావుంటుంది? అని చాలామందికి యోచన. ఆ స్వరాజ్య స్వరూపం మహాత్ములవారేమి, తదితర కాంగ్రెసుపెద్దలేమి, పత్రికలలో వ్రాసి, మహాసభలలో ఉపన్యసించీ తెలియబరిచారు. అయినా సంశయాత్ములకు దాని విషయమై సంకోచం పీడలేదు. ఇది నెరవేరే పనేనా అని వారి అనుమానం. ఈ సంశయం అక్షరజ్ఞానంలేని పామరులకే గాదు, ఆనూపానూ తెలియని ఆడవాళ్లకే గాదు, పెద్దపెద్ద చదువులు చదివిన పెద్ద మనుష్యులనుగూడా బాధిస్తున్నది.

ఇప్పుడు కాంగ్రెసువారు ఆరు రాష్ట్రాలలో ఒక్కమాటు పరిపాలనభారం చేకొని సమర్థతతో నిర్వహిస్తూ ప్రజాహితకరమైన ఉత్తరువులు జారీచేస్తుంటే స్వరాజ్యమంటే యేమిటో అందఱికీ అర్థమై సందేహాలన్నీ విచ్చిపోతున్నాయి. కాని వెన్నెలసుఖ మనుభవించాలంటే షోడశకలాపరిపూర్ణుడగు పూర్ణిమనాటి చంద్రుని వెన్నెలే అనుభవించాలె గాని విదియనాటి వెన్నెల యే మాత్రము సంతోషము గొలుపుతుంది? ఆ చంద్రుడెంత? ఆ వెన్నెల వెలుగెంత? అదిఉండే సమయమెంత? అంతా లేశమాత్రమే. అటువంటిదే యీ రాష్ట్రస్వాతంత్ర్యంగూడా. అందుకనే కాంగ్రెసువారు పూర్ణస్వాతంత్ర్యమే లక్ష్యంగా పెట్టుకొని యిప్పుడు మన కీయబడిన స్వాతంత్ర్యం అణావంతుమాత్రమే అనీ పదహారణాలు పొందడమే పూర్ణస్వాతంత్ర్యోపలబ్ధి అంటున్నారు.

## మన ప్రభుత్వము మన ప్రజలు

ఇన్నాళ్లనుంచీ కాంగ్రెసూ ప్రభుత్వమూ పరస్పర స్పర్థగల రెండు భిన్నపక్షాలుగా వుండి వొకరినొక రెదిరించుకుంటూ ఒకరినొకరు విమర్శించుకుంటూ ఉండేవి. వానిని బట్టి ప్రజలుగూడా రెండు తరగతులుగా ఉండేవాళ్లు. ఇప్పుడు కాంగ్రెసే పరిపాలనా బాధ్యత వహించినందున ప్రజలే ప్రభుత్వమూ, ప్రభుత్వమే ప్రజలు అయిపోయింది. అందువల్లనే మన ప్రభుత్వమని ప్రజలూ, మన ప్రజలని ప్రభుత్వమువారూ అనుకుంటున్నారు. ఈపరిస్థితి మూడునాళ్ల ముచ్చటేగాని అయిదేండ్ల పూర్ణాయుర్దాయం కలదేగాని చూడ ముచ్చటగా మాత్రం ఉన్నది. అంతే. నిజంగా పారచూచుకుంటే ఈ రాష్ట్రీయస్వాతంత్ర్యం బడిపిల్లలకు భూగోళం స్వరూపం చూపించడానికి నిర్మించబడిన గ్లోబులాగా ఉన్నది.

రాజకీయంగా పిల్లలుగాఉన్న ప్రజలకు యీ గ్లోబు చూపించి స్వాతంత్ర్యం యిట్లాఉం టుందని పాఠం చెప్పడానికి కాంగ్రెసువారు దీనిని వినియోగించుకుంటున్నారు. అంతకు తప్ప ప్రజలకు కావలసిన అక్కరలన్నీ తీర్చ గల అవకాశాలు యిందులో యేమాత్రమూ లేవు. ఇంట్లోగాని బయటగాని ప్రభుత్వం లోగాని ఎచ్చటనైనా డబ్బుమీద పెత్తన ముంటేనే పెత్తన మనిపించుకుంటుంది గాని వాకిలివూడ్చడం, అంట్లుతోమడం, అన్నం వండడం పెత్తనం అనిపించుకోదు. యిప్పు డీ రాష్ట్రీయపరిపాలనలో మంత్రులకు యీయబడ్డ స్వాతంత్ర్యం కేవలం యిల్లు చక్క పెట్టడమంటిదే గాని డబ్బుపై పెత్త నం కలది గాదు. మంత్రులు అత్తలేని కోడళ్లు గాదు. రోజూ యింట్లోఉండి పోరు పెట్టకపోయినప్పటికీ అత్తగారైన గవర్నరు గారి అజమాయిషీ ఉండనేఉన్నది. ముఖ్య మైన ఉగ్రాణంకొట్టు ఖజానాకొట్టు తాళం చేతులు యిప్పటికీ గవర్నరుగారి బొడ్లోనే ఉన్నవి. డబ్బు యీవత్తు మూటగట్టి బొడ్లో దోపుకొని ఉగ్రాణంకొట్టుకు తాళంవేసి కాశినో కూశినో గింజాగిట్రా యివతల పార బోసి యింటిపెత్తనమంతా నీ కిచ్చాను. నా కేమీ సంబంధంలేదు. నీ పెనిమిటికీ బిడ్డలకు నీ పుట్టింటివారికీ నీ నౌకర్లకూ ఎట్లా పెట్టి పోషించుకోవాలో అట్లా పెట్టుకో. నీచేతి కడ్డులేదని కోడలుకు సర్వాధికార మిచ్చినట్లు పలుకుతూ పని తప్పించుకొనే అత్తగారిలాగా గవర్నరు పెడగాఉంటే అపరిమితమైన బత్తెపుగింజల్లో తా నింత తిని తృప్తిగా యితరులకు పెట్టడా నికి చేతగాక తడుముకొనే కోడలులాగా మంత్రు లున్నారు. ఈపరిస్థితుల్లో ఆకలి దప్పులతో ఆవురావురుమంటున్న ఈ కుచేల సంతానాన్ని మంత్రు లేవిధంగా తృప్తిపొంది స్తారో! అయినా స్వతంత్రమో స్వర్గ లోకమో అన్నారు. కటికిచీకటికంటె కాస్తంత దివ్వెవెలుగైనా మేలేగా!

ఒకస్త్రీగూడా

ప్రజాకంటకమైన జస్టిసుప్రభుత్వాన్ని పడ గొట్టడంలో అయితేనేమి, కాంగ్రెసు అభ్య ర్థులను అత్యధికంగా గెలిపించడంలో అయితేనేమి, బలవంతులైన జమీందారీ అభ్యర్థులను ఓడించడంలో అయితేనేమి, అభ్యర్థినిగా నిలబెట్టిన ప్రతియువతీమణినీ జయమొందించడంలోనైతేనేమి మద్రాసు రాష్ట్రము దేశమంతటికీ తలమానికమై గణ్యతకెక్కింది. దేశంలో మరే రాష్ట్రం సంపాదించని సభ్యుల మెజారిటీగూడా మద్రాసు రాష్ట్రానికే దక్కింది. ఇన్ని విధాల గణ్యత సంపాదించిన చెన్నరాజ ధాని మంత్రిత్వనిర్ణయంలోగూడా ఆదర్శ ప్రాయంగా ప్రవర్తిస్తుందనుకున్నారు. ముఖ్యంగా ఒక్కస్త్రీని మంత్రిణిగా నియ మించే ఘనత చెన్నపురికి లభించితీరుతుందని స్త్రీ లాశించారు. కాని దానిలో మద్రాసు తీసికట్టనిపించుకొన్నది. నిజంగా యిది విచారకరమైన విషయం.

## మనసులో మాటలు

మద్రాసు రాజధానిలో స్త్రీల జనాభా ఎక్కువ. చదువుకున్న స్త్రీలుగూడా అధికమే. మాంటుఫర్డు సంస్కరణాల్లో మద్రాసురాష్ట్రమే ప్రప్రథమమున స్త్రీలకు శాసనసభాప్రవేశార్హత గల్పించి ముత్తులక్ష్మి రెడ్డికి డెప్యూటీప్రెసిడెంటు పదవి యిచ్చి ప్రజామోదానికి పాత్రమైంది. ఈ నూతన రాజ్యాంగసంస్కరణాల ప్రారంభసమయంలోగూడా మద్రాసురాష్ట్రం ఒకస్త్రీగూడా మంత్రిణి గావటానికి అవకాశమిచ్చి ముందడుగు వేసినట్లైతే ఎంతో బాగుండేది. రాష్ట్ర గౌరవంగూడా యినుమడించేది. కాని మొదునల్లనో మద్రాసు రాష్ట్రానికి ఆ ఖ్యాతి దక్కలేదు. ప్రభుత్వపరిపాలన తీసుకున్న ఆరు కాంగ్రెసు రాష్ట్రాలల్లో సంయుక్త రాష్ట్ర మొక్కటే విజయలక్ష్మి పండిట్ సతికి మంత్రిపదవి యిచ్చి ప్రత్యేకగౌరవం సంపాదించుకొన్నది. నిజంగా ఆలోచిస్తే రాష్ట్రీయస్వాతంత్ర్యం గణాధిపతి బొడ్లో వ్రేలుబెట్టిన కథలాగా ఉంటే ఉండనీగాక పురుషులతోబాటు స్త్రీలకూ అందులో భాగ మిచ్చినట్లైతే నాయకుల సమదృష్టికి నిదర్శనంగా ఉండేది.

అయినా యావద్భారతప్రజాక్షేమవిచారణకూ కంకణం కట్టుకున్న కాంగ్రెసు సభ్యులు స్త్రీల సమస్యలను పరిశీలించడంలో న్యాయంగా ప్రవర్తిస్తారనీ, ముఖ్యంగా స్త్రీసభ్యురాండ్రు స్త్రీలకు సంబంధించిన విద్య ఆరోగ్యమూ, వైద్యమూ, ఆర్థికాధికారము, మత సాంఘిక హక్కులు మున్నగు విషయాలలో శ్రద్ధగా కృషిచేసి శాసనకర్తల దృష్టికి తీసుకొచ్చి చేయవలసినంత ఉపకారం చేస్తారని నమ్మవచ్చు. ఎప్పటికీ విశ్వాసమే మదికి పూరడింపు.



# ప జు లు

గత సంచికయందలి పజులకు సరియగు సమాధాన మొక్కటియురాలేదు. కావున సమాధానము లంగీకరించుకాలము సెప్టెంబరు 15 వ తేదివఱకు పొడిగించబడినది.

క్రింద చూపబడిన పజులును పూర్తిచేసి మావద్ద సీలుచేయబడియున్న జవాబుతో సరిపోవునట్టులు సరియైన సమాధానమును సెప్టెంబరు 15 వ తేదికి లోపల పంపినవారికి ఒక సంవత్సరము గృహలక్ష్మి సంచిక ఉచితముగా పంపబడును. స్త్రీలుమాత్ర మిందు పాల్గొనవగును. ఒకరొక రెన్నేని జవాబులను పంపవచ్చును. జవాబులన్నియు గృహలక్ష్మి కూపనులందే యుండవలయును. ప్రవేశరుసుము లేదు. సంపాదకుల తీర్మానమే అంత్యముగా పరిగణింపబడును. ఫలితములు అక్టోబరుమాసపు సంచికలో ప్రచురింపబడును.

అడ్డము

1. ధాన్యము రవానాచేయుట కెక్కువగా నుపయోగింపబడునది.

3. తీరము.

5. పెక్కుచట్టములకు నే డిది అవశ్యకము.

6. మేకులు.

9. కాపువారి పట్టపుపేరు.

10. చోటు.

11. (త్రిప్పి) పర్వతము.

నిలువు

1. ఒకజాతియొక్క.

2. దశావతారములలో నొకరి యాయుధము.

3. పన్ను.

4. నేటి ప్రపంచమున దీనిభయ మెక్కుడుగ గలదు.

7. మార్గము.

8. బుద్ధి.

| 1 |  | 2 |  | 3 | 4 |
|---|---|---|---|---|---|
|  |  | 5 |  |  |  |
|  | 6 | ల |  |  |  |
| 7 |  |  |  | 8 |  |
| 9 ర |  |  | 10 | న |  |
| 11 |  |  |  |  |  |

పేరు............................

చిరునామా............................

............................

గృ. ల. 5.

# పరిటాల ఆశారత్నము

శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు

గుంటూరుజిల్లాలో "పరిటాల" అనే గ్రామమున్నది. అది పూర్వము చాలా ఉన్నతస్థితియందుండెడిది. పదునాల్గవ శతాబ్దమున హిందూదేశమునకు యాత్రకై వచ్చిన మార్కోపోలో అను స్పెయినుదేశస్థుడు పరిటాలయందు రత్నపుగనులు గలవనియు అచటిరత్నములు చాల నాణ్యమైనవై ఎక్కుడు విలువగలవనియును తనయాత్రా పుస్తకమున వ్రాసియున్నాడు. ఇపుడు జోహానసుబర్గున రత్నముల బయటికి దీయుచున్నారు గాని పూర్వము సర్వదేశములకు మన హిందూదేశమే రత్నముల నెగుమతి చేయుచుండెడిది. అందువలననే ఏదేశమునకు రాని గొప్పదైన రత్నగర్భయను సార్థకనామధేయమును హిందూదేశము పొంది యున్నది. పదునాల్గవ శతాబ్దమున పరిటాల యొకగొప్ప లోయ. అవైపు నీవైపు పెద్ద పర్వతపంక్తులుండెడివి. నడుమచూచిన కన్నులు గిరునతిరుగు అగాధమైన లోయ. ఆలోయయందు మిలమిలమెరయు జీవరత్నములుండెడివి. ఆలోయయంతయు త్రాచు పాములమయమై నరులకు చేరరానిస్థలమై యుండెను. ఎవ్వడైన నిర్భాగ్యుడు రత్నములకాశించి దరిచేరెడునేని వానికి రత్న ప్రాప్తిమాట యటుంచి శమనమందిరప్రాప్తి మాత్రము కాలభుజంగముల వలన బ్రాప్తించెడిది. ఆ లోయలోనున్న కడుంగడు పెద్ద త్రాచులకు జడిసి తత్ప్రాంతముల వారా రత్నములకై యాసవదలుకొనిరి. దూరదృష్టియంత్రములద్వారా నాలోయలోనికి బరికించిన వారలయ్యది విషవహ్నుల వెలిగ్రక్కు యా త్రాచు బాముల గాంచి "అయ్యారే! ఇది నాగలోకమా?" యని భ్రమచెందుచుండిరి. పరిటాలలోయ సమీపముననే పరిటాలనగర ముండెడిది. అందు పెక్కురు ధనవంతు లుండుటవలనను రత్నపరిశ్రమాగారము లాయూర మిక్కుటముగ నుండుటవలనను ఆ పరిటాలనగర మున్నత సౌధరాజములచే వెలుగొందుచు ధనికుల కంఠములయందలి రత్నహారములచే అనర్ఘప్రభల వెలిగ్రక్కుచు మిక్కుటముగ రాణించుచుండెడిది. నానాదేశముల నుండి రత్నవర్తకు లా పురికరుదెంచి రత్న వ్యాపారము నొనరించుచుండిరి. అచ్చట సాధనచంద్రు డను నొకడుగలడు. అతడు సామాన్యకుటుంబీకుడు. అతని కెటులైన ధనవంతుడు కావలయునను పట్టుదల కలదు. ధనుర్విద్యయందతడత్యంతనిపుణుడు. పారెడుపక్షినైన నొక్క యలుగున గూల వేయగలడు. పరిటాలలోయయందలి జీవరత్నములలో కొన్నిటి నెటులైన బడసినచో తాను ధనముతో తులదూగవచ్చునని యెంచి యాతడా రత్నముల బడయుటకొక యుక్తిని బన్నెను. అతడు మాంసపు ముద్దలను ఆ పరిటాలలోయయందలి జీవరత్నములపై బడవైచెను. మాంసము

యొక్క రక్తపు కరడులకు జీవరత్నము లంటుకొనినవి. పర్వతాగ్రమున నేవైన నాగు బాముల లంకించుకొనిపోవు నుద్దేశముతో గూరుచున్న గరుడపక్షులు మాంసమును గాంచినంతనే రివ్వున లోయలోని కేగిరి మాంసముముక్కను దన్నుకొని గగనవీధి కేగిరినవి. సాధనచంద్రుడు గురిచూచి యొక గరుడపక్షిపై దనబాణమును వదలినాడు. వెంటనే యయ్యది విలవిల దన్నుకొనుచు కొండదవ్వున గ్రిందబడి ప్రాణముల వీడినది. సాధనచంద్రుడు పరుగు పరుగున బోయి యా రత్నపుముద్దకంటిన రత్నంబులగైకొని విక్రయింప యత్నించినాడు. స్పెయినుదేశమునుండి యాత్ర కరుదెంచిన మార్కోపోలో గొప్ప రత్నపరీక్షకుడు. అతడా జీవరత్నములగాంచి యచ్చెరువంది యొక లక్షరూపాయల నొసంగి వానిని గొని తన స్పెయినుదేశమున ఎనిమిదిలక్షల రూపాయల కమ్మినాడు. ఆ ఎనిమిదిలక్షల రూపాయలకు గొనిన బేహారి వానిని ఫ్రాంసు దేశపు రాజైన పదునారవ లూయికి ఇరువదిరెండు లక్షల రూపాయలకు విక్రయించి యపరిమితలాభమును బొందినాడు. వానికి లూయి ఆశా రత్నములు (Hope Diamonds) అని పేరిడి తన ప్రియపత్నికి కంఠహారముగ నొసంగినాడు. ఆయువతి యొకనాడు తన యుద్యానవనమున విహరించుచుండ నొకపాము ఆమెను కరచినది గాని ఆ రత్నప్రభావమున నా విషము విరిగిపోయి హాని యొనరింపలేదు. అట్లు సమస్త దేశములకు రత్నముల సప్లైచేయు ఆంధ్ర దేశ నాయకమణి యనదగు పరిటాల ఆంధ్ర జొహానీసుబర్గు గతి నే డెటులున్నదో తిలకింపుడు. వంద గుడిసెలు మాత్రమె యిపుడటనున్న సౌభాగ్యము. కాలగతి నెరుగ నెవ్వరితరము? సౌధములతో నలరారిన పరిటాల నేడు పూరిగుడిసెల కాలవాల మగుట ప్రకృతిచిత్రము గాక మరేమి?

---

## మార్పు:

అ. సీతారాముడుగారు

కమ్మతావిపైఁజిమ్ము పువ్వుమ్ములెన్నొ,
చిట్టికోయిలమెక్కెడు చిగురులెన్నొ,
ప్రకృతికాంతకు నవ్యశోభలనుగూర్చి
హాయిగొలిపెడు పచ్చనియాకులెన్నొ,
మాయమైనవి కాలతమస్సునందు!
చేదులోఁ దీపి చూపనెంచితివ? దేవ!!

గొంతుసరించితీయగాఁ గోకిలమ్మ
తీయ సుమనోజ్ఞవిమల గీతికలులేవు;
తేనియలఁదెగద్రాగి మత్తెక్కు తేఁటి
యాలపించెడు కూనరాగాలు సున్న;
పచ్చికలుమేసి బ్రదికెడు పశుగణమ్ము
ఈయెడారిలో నెట్లు జీవింపగలవొ!

సరునిహృదయమ్మునూడ్చి ప్రాణములఁదీయు
భయద దుఃఖదవానల జ్వాలనార్పి
మోదవార్ధితరంగాల ముంచు సృష్టి
దివ్యసౌందర్య మీనాఁడదృశ్యమయ్యె!
ఉగ్రతిమిరమ్ముచే నిండి యున్నయా జ
గమ్ముపై జీవయాత్రను గడుపుటెట్లొ!

# ఆ యధికారము
# ఆ గౌరవము మీదే





గృహపత్నిగా నుండుట సామాన్యంబుకాదు. ఎవ్వరును గమనించని నూరు విషయములు గలవు. వాటిలో కొన్నిటిపై, స్త్రీలకే యధికారము. "టీ" తయారుచేయు పనివారికి ముఖ్యము. తెలిసిన స్త్రీ లీ దయాస్వరూపమైన "టీ"ని తమ పురుషుల కిచ్చుట మరువరు. నిర్దోషమైన యీ యారోగ్యపానమే సంసారానందము గల్గజేయుచున్నది.



"టీ" జేయు క్రమము: శుద్ధమైన వేడినీరు. కొంచెము వేడిచేసిన శుద్ధపాత్ర. ఒక స్పూన్ "టీ" యొక్కొకరికిన్ని, మొత్తముగా నొక స్పూన్ యధికముగాను పాత్రములో వేసి, బాగుగా మరుగుచున్న నీటిని పోయవలెను. 5 నిముషములుం తాళి, కప్పులలో పోసి, పాలుం, చక్కెర చేర్చవలెను.

## సంసారమునకు తగుపానము — ఇండియా "టీ"

IK 33 RS.

# ఏంటొనీ —

రమారమి రెండువేల సంవత్సరములక్రిందట రోమకమహాసామ్రాజ్యము ఉచ్ఛదశయందుండెను. వీర రోమకమహాశూరుడైన జూలియస్ సీజరు, క్రీ. పూ. 44 సంవత్సరమున వధింపబడెను. వెంటనే 'ఏంటొనీ' రోమకసామ్రాజ్యమును తన హస్తగతమొనర్చికొన యత్నించెను. విజయలక్ష్మి దాదాపు 'ఏంటొని', హస్తగతమయ్యెను. ఈతరుణమున ఆఫ్రికాఖండమునగల 'ఐగుప్తు' దేశముపై తన చమూవాహినులను, 'ఏంటోనీ', నడపించెను. ఐగుప్తురాణియగు "క్లియోపాట్రా" జగద్విఖ్యాతిగాంచిన భువనైకసుందరి. ఈమెను గాంచినంతనే, ఏంటొనీ పరవశుడై సర్వమునుమరచెను. మోహావాగురులజిక్కి అహోరాత్రములు మోహనారాశిలో మునిగి తేలుచుండెను. ఏంటొనీ-క్లియోపాట్రాలు అన్యోన్య ప్రేమానుబద్ధులు. వీరిప్రేమ అసమానము.

## ఏంటొనీ

అస్తమించుచుంటి—'ఐగుప్తులక్ష్మి'!
అస్తమించుచుంటి—
ప్రాణవాయువులు కంఠగతమయ్యె
అంధకారతిమిరమ్ములును,
మరణవేదనయు ననుగ్రమ్ముచుండె
ప్రాణనాయికానను, నిండుకౌగిట జేర్పవేమి?
గద్గదికమాన వేమి? చెవియొగ్గవేమి?
నాహృదయవేదన యాలింపవేమి!

నిరుపమాన శౌర్యనిధులైన
నాచమూవాహినులు,
జయపతాకములు మెరయింపకున్నవేమి?
ఘోరవారాసి తరచు,
నాయద్వితీయ నౌకరాసులు
పసచెడి తునియలైననేమి?
రవితేజమును మించు చమూపతులు
కనుసన్నమెలగి ననుసేవింపకున్ననేమి?
నీచమరణంబు నొందంగ జాలనేను

వీరరోమకమహాశయునికీర్తి
మరణశయ్య నలంకరింపంగవలయు నేను.
నీచసీజరు శునకంబు [సింపంగగలదె?
కాలగతినొరగిన నీ కేసరీంద్రమును పరిహ
శత్రుకరవాల మెన్నడును
వీని త్రుంపనేరదు, నేదెపుడు
నాదుకరవాలమున నె, నేనుగ్రుంగవలయు.

నీదు హృదయశయ్య నిదురించుచును,
యశోమరీచికల దిగనాడె నెవడు?
ముగ్ధమోహన కళ్యాణమూర్తివైన
నిన్ను సేవింపుచును, నీ ప్రేమడోలికల
తాండవించుచు,
లోకసామ్రాజ్యమును గాలదన్నె నెవడు?
అట్టినీహృదయాధినాథు మన్నింపరమ్ము.

నీచమతులైన సామాన్యజనులు [గలరె?
రోమునగరమ్మునను, నాకీర్తినలుపు గావింప
అర్ధాంగలక్ష్మివై యలరారు

# క్లియోపాట్రా

ఇట్టిస్థితిలో 'ఆక్టేవియస్ సీజరు' కూడ రోమకసామ్రాజ్యమును తనవశము చేసికొన యత్నించెడి వారలలో నొకడు. ఇతడు వెంటనే తన సేనాప్రవాహముల ఐగుప్తుపైకి ప్రవహింపజేసెను. 'ఆంటొనీ' క్లియోపాట్రా పరిరంభణడోలికలలో నూగులాడుచుండి ప్రపంచమునే మరచియుండెను. ఆక్టేవియస్ సేనలు ఐగుప్తు రాజభవనముల ముట్టడించెను. సర్వమును ఆక్టేవియస్ హస్తగతమయ్యెను. సారసాక్షికై సామ్రాజ్యమును గాలదన్నినవారిలో ఆంటొనీ అగ్రగణ్యుడు. నాయికానాయకులు చేయునదిలేక ఒకరినొకరు ఎడబాయజాలక ఆత్మహత్యల గావించికొని స్వర్గమలంకరించిరి. అంత్యదశయందలి నాయకానాయకుల విలాపము ఈ క్రిందిగీతికలయందు పొందుపరుపబడినవి.

## అంత్యసందేశము

'ఆక్టేవియూ' ఎంత గుండునొక్కొ-
నాదుకులదైవతములు నాసతినిరక్షింత్రుగాక!

ఏది ఎట్లయినగాని,
ముగ్ధమోహనకళ్యాణీ! సౌందర్యరాశి!
'నైలునదిమత్స్యకన్య! ఐగుప్తువన్నెరాణి!
ప్రాణపదమైన నిన్నెట్లు బాయగలను?
నీదు చిరునవ్వు వెన్నెలలచేత
ఘోరనరకాంధకారబాటల మెరయ
జేయుమో, మోహనాంగి!

విజయలక్ష్మి సీజరునకే యొసగవమ్మ,
జయకిరీటమ్ము యతనినెత్తినే గట్టవమ్మ,-
లెక్కసేయ 'సెనెటుసభ' కోపమ్మును
లెక్కసేయ
నీప్రేమ జారగొంటినేని, యదియ నాకు
సామ్రాజ్యలక్ష్మి
అస్తమించుచునుంటి, ఐగుప్తులక్ష్మి! అస్త
మించుచునుంటి.

అవిగో! శత్రువాహినుల పదఘట్టనలు-
వచ్చిపడుచుండి రయ్యొయ్యో, వచ్చిపడిరి
ప్రాణనాయిక యేల తడయుచుంటివయ్యొ
-రావదేమి?-కనుల కాన్పింపవేమి?-
లేదులాభమ్ము-లేదుయాశ-లేదు, లేదు.

శత్రుమూకలకు నేనేల చిక్కవలయు
ఖడ్గమా యజమానిరక్తమ్ము చవిజూడగలవు
అతనికీర్తి గాపాడగలవు!
అమరసింహాసనమున జేర్పగలవు-
ఐగుప్తుదేవతలార! [రయ్యొ
నాప్రాణనాయిక 'క్లియోపాట్ర' గాపాడ
ప్రాణనాయిక-క్లియోపాట్ర-
రోమకమహాసామ్రాజ్యమా-సెలవు-
సెలవు-ప్రాణనాయికా-క్లి-యో-పా-
ట్రా!-సె-ల-వు! సె-ల-వు!.....

ఎం. కె. కౌండిన్య.

# అభ్యుదయమున కాయువుపట్టు

'కృష్ణకుమారి'

ఓంకారపంజరశుకీం
ఉపనిషదుద్యాన కేలీ కలకంఠీం।
ఆగమవిపిన మయూరీం
ఆర్యామన్తర్విభావయే వాణీం॥

వివిధ విజ్ఞానవివరములయందు మహాపురుషుల ప్రసవించి జేజేలనందిన పూత వీరప్రసూః, భారతమాత వింధ్యాహిమాలయాది శోభాప్రపూరిత పర్వతపంక్తిచేతను, గంగా గోదావర్యాది పుణ్యస్రవంతుల చేతను, దండకాది సమగ్ర సహజసుందర కానన రాజి చేతను, దర్శనమాత్ర ముక్తిప్రదాయక వారణాస్యాది క్షేత్రాళిచేతను, తీరువోని ప్రకృతిసంపదల పేరిము వారిన యశస్సుగల పుణ్యవాటిక హిందూవాటిక. పావన హిందూమతము సువిశాలమైనది. సుప్రతిష్ఠితమైనది. "నదీనాం సాగరోగతిః" అనునట్లు సర్వమత సమ్మేళన మిందుగలదు. హైందవ నాగరికత, హైందవ కళావిజ్ఞానమే ఆదికాలమున నితరమతముల వారికి ఒరవడిబంతి.*

అట్టి హైందవభూమియందు, హైందవీయమతము నందు సాధ్వియే సర్వసమ్మాన్యయై నెగడుచున్నది. "ప్రకృతిః స్త్రీ పురుషస్తు పుష్కర పలాశవన్నిర్లేపః" అను సాంఖ్యమతసూక్తియే ప్రకృత్యంశమగు స్త్రీ యౌన్నత్యము నెలుఁగెత్తిచాటుటకు చాలినంత ప్రమాణము. అనాదిజంపతులగు పార్వతీపరమేశ్వరుల నుండియు, మానవుల సాంసారికజీవితమున కూఁత గొమ్మలగు పౌరాణికదంపతులు సీతారాముల నుండియు, ప్రజాకౌటుంబిక జీవితమును బాగుపఱచుట కుద్దేశింపఁబడిన భారతకాలపు కాంతలనుండియు, చారిత్రాత్మకముగ వాసిగాంచిన ఝాన్సీ చాంద్‌బీబీ, జోసెఫ్, రుద్రమాదులనుండియు, సారస్వతదృష్టిని సన్నుతికెక్కిన మొల్ల, తరిగొండ వెంకమ్మ, ముద్దుపళన్యాదులనుండియు, స్త్రీశక్తి యఖండముగ పూజింపఁబడుచునే యున్నదని గ్రహింపవచ్చును. "రమ్యాశ్రీ రామా యదికులవధూస్త్యాగ భోగాయవిత్తం, వక్త్రే వాణీ సరసకవితా శంకరే చిత్తవృత్తిః, సద్భిస్సంగర్వపుష్టిదృఢతా, సత్కులే జన్మపుంసాం, ధిక్ దూరాధనశనపదమ్, స్వర్గమేకాన్తదుర్గమ్." అనునీ కవి వాక్యమున నిల్లాలికెంత ప్రాధాన్యమీయఁబడినదో మీకే యెఱుకయగును. "యత్రనార్యః పూజ్యంతే తత్రరమంతే దేవతాః" అను ప్రమాణవచనము హిమగిరి శృంగముకంటెను సత్యసుందరమైనది కాదా? సంసారమున సాధ్వి గృహసామ్రాజ్యమున కేకచ్ఛత్రాధిపత్యముగ నభిషిక్త. "ఇల్లుజూచిఁ దెలియు నిల్లాలిశుభవృత్తి" అను వాక్యములచే నిల్లాలి కింటి యందుఁగల యాజమాన్యము అవబోధితమగుచున్నది. స్త్రీ యిట్టి పూజ్యస్థానము వహించుటకును, అనర్ఘరత్నమువోలె మగవారిచే నాదరింపఁబడుటకు కారణమేమందురు? విద్య! సద్విద్య!!

మానవుని సదాశయములు, మానవుని యానందము, మానవుని విశ్రాంతి, మానవుని కార్యదీక్ష వేయేల మానవుని సర్వస్వము, విద్యయందే యిమిడియున్నది.

"కింకోకిలస్య ఋతేనగతే వసంతే
కిం కాతరస్య బహుశస్త్రపరిగ్రహేణ,
మిత్రేణ కిం వ్యసనకాలపరాఙ్ముఖేన
కిం జీవతేన పురుషస్య నిరక్షరేణ."

అను శ్లోకముయొక్క అంతిమపాదమున జదువురాని వారు బ్రదికియు చచ్చినవారితోడనే సమానమనిరి.

* జూలై 24, 25 తేదులలో బాపట్లలో జరిగిన శ్రీ స్త్రీహితైషిణీమండలి వార్షికోత్సవ సభ కధ్యక్షత వహించిన ఉభయభాషాప్రవీణ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగా రధ్యక్షోపన్యాసము.

"విద్యావిహీనః పశుః" అహో! ఇందెంత గభీరయర్థమిమిడియున్నది? ఈమాట వరాలమూటకదా! ఆలోచించినకొలఁది, చదువురానివారు మానవత్వము నుండియే తొలఁగింపబడుచున్నారే. మానవులు విద్యయను కన్నుచేఁబూని తమకుఁ గంటికగపడనిదారినిఁ దడిమికొనుచునైనఁబోఁగలరు. విద్యాతురవారికి రక్షయై కంటక పరివృతములగు దుర్గమపథములను నరికి వేయుచు గమ్యస్థానమును జేర్చివేయఁగలదు. విద్యవలని యానందమును జెప్పుటకు వాక్కులుచాలవు. ఈవిషయమున బ్రహ్మానందమునుగూర్చి చెప్పిన ఉపనిషత్సూక్తి నిట వ్రాసిన నాసాహసమునకు క్షమింత్రుగాక. "నతత్ర చక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నమనో, నవిద్మో, నవిజానీమో". రసపిపాసువులకు విద్యాక్షీరసాగరమున విగళితాన్యవిషయులగు నానందమను స్వాదుజలము లభింపఁగలదు. విద్యకు ప్రయోజనము విశ్వకళ్యాణమే. ఎట్లందురేని, ఆర్థికముగను, రాజకీయముగను, సాంఘికముగను, చారిత్రికముగను, లౌకికముగను లోట్లు కాన్పించుచో నెత్తిచూపి, ప్రభువులోలె శాసించి శిక్షించుటకును, మిత్రునిపోల్కి హితవుచెప్పి రక్షించుటకును, కాంతరీతి లాలించి, ప్రేమించి ఉన్మార్గమునుండి మఱల్చి ఉద్ధరించుటకును, భాషాంగణమున నెన్నేని ధర్మశాస్త్రములున్నవి.

మనభారతభూమి నైష్ఠికత్వమున బెట్టినది పేరు. మనపూర్వులు పారమార్థికచింతాపరులు – అట్లని వారు లౌకిక జ్ఞానశూన్యులు కారు. వా రాధ్యాత్మికత్వ ముగ్గుపాలతో నేర్చికొనిరి. ప్రాకృతికత్వము నూఁటి వయసుననే కూర్చికొనిరి. వా రా రెండువిద్యలయందును తొలకనినిండుకుండలు. అప్పటవిద్దనేర్పుటకు జాతిమతభేదములు లేవు. శక్తియు నాస్థయు నుండుచో స్త్రీపురుషులిర్వురు చదువవలయుననియే వారి రాద్ధాంతము. వైదికయుగమున లోపాముద్ర, రోమశ, విశ్వవారా, శశ్వతి, అపాల మున్నగువారు మంత్రపఠన మొనర్చిరి. ఇంకకొందఱు ఋక్కులనే రచించినట్లు ఋగ్వేదము ఋజువుపఱ్చుచున్నది. అప్పటి ఉన్నతవంశ స్త్రీలు సైతము చాపలల్లుట, కత్తిరియొరలను జేయుట, మున్నగుపరిశ్రమలలో మగవారికి చేదోడు, వాదోడుగనుండి ఆర్థికముగ వారికి మిక్కిలి సాయం పడెడివారు. పౌరాణిక, చారిత్రిక స్త్రీలు కొంతమంది యుద్ధములలోఁగూడ పురుషులకు సాయమొనర్చినట్లు మనకు బాగుగఁదెలియును. విల్సన్ దొరగారు "భారత రమణు లనుభవించిన పవిత్రస్వాతంత్ర్యము, ఏదేశమునను, ఏకాలమునను, ఏస్త్రీలును అనుభవింపలేదని వ్రాసినారు. ఇందలి 'పవిత్ర' పదమునకు స్త్రీలు హద్దుమీరి తమ స్వాతంత్ర్యమును వినియోగింపలేదనియే కదా! అర్థము! సమున్నత హిమవద్ధరశిఖరినుండి పాఱుపావనగంగాతరంగములకుండు అచ్ఛత వారి స్వాతంత్ర్యమునకున్నది.

ఇట్టిపూజ్యత, ఇట్టిస్వాతంత్ర్యము స్త్రీలకడనుండి యానడుమ కొన్నినాళ్లు సెలవుగైకొనినవి. వారికిచ్చిన మన్నన మంటఁగలిసినది. రానురాను వారిది నవ్వులాటబ్రతుకై చూచువారలకు జాలిగొల్పు స్థితిలోనికివచ్చినది. విద్యాభ్యసనము, విస్మృతిపథమునఁబడుటయే దీనికి కారణము. పురుషుఁడైనను, స్త్రీ సముచితవిద్యావతియై, తనకు గృహనిర్వహణమునఁజేయూఁతనిచ్చిన వాఁడే నెత్తినఁబెట్టికొని యాదరించెను. కాని పశుప్రాయయై తనకు సాయపడకుండుట యటుండ, నజ్ఞానముచే, చీటికిమాటికి తన్ను చీదర పెట్టుచుండ నాతఁడేల సన్మానించును? స్త్రీలు అజ్ఞానముద్రాంకితలై, అజ్ఞానులగు పురుషులచే బాధితలగుచు, బాధింపబడుటయే తమవిధియని తలఁచిన దినములును కొన్నికలవు. అపుడు దేశమంతయు నడి, సర్వతో నిస్తరంగసముద్రమువోలె నిద్రాణమైపోయినది. ఆరోజులలో శ్రీరామమోహనరాయి మున్నగు మహనీయుల యుచితసంస్కారముఁబడసి స్త్రీలోక మొకింత కన్విచ్చినది. ఇప్పటికి నింకను స్త్రీలను నిదురమంపుపూర్తిగ వీడలేదు. ఇపుడిపుడు స్త్రీలహృదయ

మున చిరంతనముగ నివాసమొనర్చిన ధీకరాజ్ఞానతిమిరము మెల్లన విచ్చిపోవుచున్నది. నేఁటికైనను హిందూ ఇల్లాండ్రను ఇతరస్త్రీలతోఁబోల్చిచో వారికి చాల దూరముననున్నట్లు తెలియఁగలదు. రష్యాదేశపు స్త్రీలు నూటికితొంబదిమంది ఉన్నతవిద్యనంది ఉద్యోగములఁబ్రవేశించి తాము సొంతధనమును సేకరించుకొనుచున్నారు. మన హిందూయువతులు 100 కి 12 వంతునఁ జదువుచున్నారు. ఎవరెస్టు శిఖరమునదాపున రష్యన్ రమణులు విద్యారంగమున క్రీడించుచున్నారు. ప్రత్యంతపర్వతములకడ భారతపత్నులు ప్రాకులాడుచున్నారు. ఇది నారీయుగము" అని గాంధీజీచే పైతము ప్రశంసింపబడిన యీకాలమునఁ గూడ - మనము వెనుకఁబడియేయున్నాము. హైందవవిద్యావతులను పర్వశాఖలును ఆహ్వానించుచున్నవి. వీరి కింకను నియతమగు కర్తవ్యపథమే గోచరము కాకున్నది. వారి యత్నము లింకను స్థిరరూపము వహించుటలేదు. వారి కొసఁగఁదగు విద్యాస్వరూపమే యిదమిత్థమ్మని నిర్ణీతముకాలేదు. ఇతికర్తవ్యతావిమూఢలై స్త్రీలీ విషయమున కాలుగాలిన పిల్లులవలెఁ ఆలజడినొందుచున్నారు.

స్త్రీలు అవయవనిర్మితినిబట్టియు, పరిసరములఁబట్టియు పురుషులనుండి వేఱుపడియున్నారు. వారి స్వరూపములవలెనె వారివిజ్ఞానమును పృథక్కుగ నుండుటమేలు. "పురంధ్రీణాంబుద్ధిః పురుషవిజ్ఞానముఖీ". సాజముగ రాసాయనికశాస్త్రము, గణితశాస్త్రము, ఆర్థికశాస్త్రము మొదలగునవి స్త్రీల కభిరుచి లేనివిషయములు. ఆడుది అన్నివిషయములలోను మగవారితో సమానముగనుండవచ్చును. కాని "యింట గెలిచి రచ్చకెక్కుట పాడి" దీనిని విద్యావతీలోకము మఱువకుండుగాక. ఇంటికివలయు కొన్నివిద్యలను స్త్రీ యవశ్యము పఠింపవలయును. ఇప్పటి ఆడువారి ఆంగ్లవిజ్ఞానము, ఉన్నతవిద్య రొక్కొకరొక వారిని పెద్దతోవలఁ బట్టించుచున్నదని వినికిడి. కాని యిం

దేమియు సిగ్గుపడనవసరములేదు. "అలవాటులేనిదే అద్దముచూచుకొనిన బహుముఖము లగుపడి వెఱ్ఱెత్తినదఁట" సీఘ్రగతి ఆశకొలఁది అపథ్యమొనర్చును అది వారితప్పుకాదు. ఇన్నినాళ్లకు సంకెలలు విడినవికదాయని పరుగిడఁబోయి స్త్రీజనమొకింత బోర్లపడినను నది అపహాస్యహేతువుకాదు – ఒకటరెంట చెడి బొప్పెలుకట్టిననాఁడే అనుభవజ్ఞానము కాలూనినిలుచును. కొందఱుస్త్రీలు "చదువుచున్నాము, చదువుచున్నాము" అను సంబరముతో, పురాతనస్త్రీలకంటె వేఱుగ భాసింపవలయునను నుద్దేశముతో పాశ్చాత్యస్త్రీల మితిమీఱినస్వాతంత్ర్యముపై చూపునిలిపి అట్లే తామును ఆచరింపఁ జూచుచున్నారు. కాని దేశాచారముల నొకింత గమనించి మన కుచితమగు విధానములలో బాలికలకు చిన్నతనము నుండియు శిక్షణమొసంగవలయును. "ఏగూఁటిచిలుక యాగూఁటిపలుకే పలుకును" పిన్నటనుండి యెట్టి ఆదర్శములతో పిల్లలకు శిక్షణనిత్తుమో ఆ యాశయములే పల్లకిబొంగులఁబోలె నాచిరుతపాయపు టెదంతలలో మొలకలెత్తి, వేఱూని, పెద్దప్రాఁకులై, లోకమున వారు కాలిడునప్పటికి తదుచితములగు ఫలములచే వారిని సుదుఃఖములకు లోనొనర్చును. "కౌమారమే వజ్ఞానారమ్భ"మ్మని కదా పెద్దలసూక్తి! "విషవృక్షమపి సంవర్ధ్య స్వయంఛేత్తు మసామ్ప్రతి" అనిరి కావున నే పసియీడునందే కనుగలిగి పెద్దలు విద్యావిషయమున శ్రద్ధాజాగ్రతలు తీసికొనవలయును. ఆవెనుక తమ సంతానము విద్యవల్ల పాడైనదేయని పశ్చాత్తాపపడుట చేతులుకాలినపిదప ఆకులువెదకుటవంటిది."

గుణవదగుణవద్వా కుర్వతా కార్యమాదౌ।
పరిణతి రవధార్యా యత్నితః పండితేన॥

వంగస్త్రీలును, ఉత్తరాదిస్త్రీలును స్త్రీలోకమున ముందంజవేయుచున్నారు. వారు విదేశములకుఁబోయి వివిధశాఖలలో విజ్ఞానమునొందుచున్నారు. మనదేశమునఁగూడ ప్రతిసంవత్సరము కళాశాలాయంత్రాగార





భమిడిపాటి రాధాబాయి　　　　భమిడిపాటి రుక్మిణీబాయి

ఈ బాలికలిరువురు మ-రా-శ్రీ భమిడిపాటి పట్టాభిరామయ్య, ఎం.ఎ. ఎల్.టి. గారి పుత్రికలు. వీరిరువురు 23-2-37 తేదీని, ఆంధ్ర మహిళా గానసభ (రాజమంద్రి) యొక్క వార్షికోత్సవమున గానము సలిపిరి. అందులకు మెచ్చి శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మ, బి.ఎ. ఎల్.టి. గారు రజతసరస్వతీ ప్రతిమను రాధాబాయికి నొసంగిరి.



సైనికశిక్షను పొందుచున్న జపాను బాలికలు



సైనికశిక్షనుపొంది యుద్ధముచేయుటకు సిద్ధముగనున్న జపానుయువతులు.

ములనుండి లెక్కకు మిక్కిలిగ పట్టభద్రులు తయారై దేశమున దిగుమతియగుచున్నారు. వీరందఱును ఆపట్టభద్రతాముద్రలతో దేశమున చెలామణీయగుట కష్టము. కొన్నినాళ్లు చనుచో స్త్రీలలోఁగూడ నిరుద్యోగి డిపార్టుమెంట్ నెలకొల్పవలయునేమో కావున స్త్రీలు తామకూడ బి.యె., ఎమ్.ఎ., క్లాసులతోడను, ఎమ్.బి.బి.యస్.,బి.యెల్., మున్నగు సర్వసాధారణ పట్టములతోడను తనివిసనక, తాము చదువుకొన్నందుకు ఉద్యోగములు లేకున్నను, ఒకరిసాయము లేకుండ తమ మనుగడ సాగించుకొనఁగ సత్తానొసఁగు పరిశ్రమలను నేర్వవలయును. “ఉద్ధరేదాత్మనాత్మానం”, రాజభాష, దేశభాష, ఆపెన్క అభిరుచినిబట్టి అన్యభాషలు, చిత్రలేఖనము, సంగీతము, తౌర్యత్రికము, కుట్టు, వ్యాయామము, చరిత్రభూగోళము, శిశుపోషణము, పాకకళ మున్నగు గృహనిర్వహణవిషయములు, మున్నగునవి స్త్రీ కవశ్యపఠనీయములు. ఎంతనేర్చినను, విఱ్ఱవీఁగు బాటు లేకుండుటయు, “పూసలలోనిదారము”మాడ్కి శీలసంరక్షణము నేమఱకుంటయు నతిముఖ్యములు.

ఈశాఖలయందు పడతులు ప్రత్యేకముగ ప్రవీణురాండ్రగుటకు దేశమున నింకకొన్ని పాఠశాలలు, కళాశాలలు, ఉచితవిద్యాసంస్థలు విరివిగ నేర్పడవలయును. అందు పూర్వరీతులను కొన్నింటినిఁ ద్యజించి యాకర్షకమగు రీతులలో శిక్షణ యీయఁబడుచుండవలయును. పాఠశాలలు, కళాశాలలకంటె స్త్రీలచేతనే నిర్వహింపఁబడు సంస్థలే స్త్రీలకెక్కువ యుపయోగకరములు. స్త్రీలకు విద్యాభ్యసనమున కవకాశము చాలతక్కువ. వారు మొదలుపెట్టినవిద్యలు ముగింపకుండఁగనే అత్తిండ్లకు పోవుచున్నారు. అట్టియెడ నత్తిండ్లలోవారు పాఠశాలకుబోయి చదువుకొను నవకాశము లుండకపోవచ్చును. ఏదేనిసంస్థ యున్నచో నందుచేరి పెంపుగాంచుటకు వారికి వీలుండును. ఇంతియకాక యింటగూర్చుండి ప్రత్యేకముగ కృషిసల్పుటకంటె నల్వురుగలచోట వారితోఁగలసి కృషిసల్పుటలో సిద్ధి త్వరలో చేకూఱును. “స్పర్ధయా వర్ధతే విద్యా” అనుమాట రిత్తకాదు. ఆస్పర్ధ సంఘీభావమును పెంపొందించునేకాని, విరోధమునకు తావీయకుండును. సంస్థలున్నచో వానిమూలమున నల్వురతోఁగలిసి కొన్ని దేశహితైకకార్యముల జరుపవచ్చును. హెచ్చుధనమును వెచ్చింపకయే ఆసంస్థల గ్రంథాలయములు, వార్తాపత్రికలు అందుబాటులోనుండి యెనలేని సాయముచేయుచుండును. ప్రభుత్వమువారు మనవిద్యకొఱకు చాలతక్కువ మొత్తమును వెచ్చించుచున్నారు. వారి సైనికవ్యయము ముందీ యల్పవ్యయమే వారికి దుర్భరమైనది. వారిని పాఠశాలలు నెలకొల్పుఁడని మొఱపెట్టుకొనుటకంటె ఉదారాశయులగు ధనవంతులను, సంస్థలస్థాపింపుఁడని మ్రొక్కుకొనుటమేలు. లేదా ప్రజాశక్తినేకముజేసి చందాలమూలమున సంస్థలనేర్పఱచుటలగు.

ఆంధ్రదేశమున నిట్టిసంస్థలు కొలఁదిమాత్రముగనున్నవి. అందు పేర్గాంచినవి:—మదరాసు సేవాసదనము, రాజనగరి ఆంధ్రయువతీ సంస్కృతకళాశాల, గర్తపురి శారదానికేతనము, వని చెప్పవచ్చును. ఇవికాక కాకినాడయందు హిందూసుందరీబాలికాపాఠశాల, ఏలాపురి లక్ష్మీసేవాసదనము మున్నగునవి యింకను కలవు. కృష్ణాగోదావరీజిల్లాలలో నున్నంత విద్యావ్యాప్తి, విద్యాభిలాష, విద్యాసౌకర్యములును నితరజిల్లాలలోఁ గానరాకున్నవి. ఈభావపురియందీ హితైషిణీమండలియు, యువతీవిద్యాలయమును స్త్రీలపక్షమున పనిచేయుచున్నవి. కాని స్త్రీలిందుచేరి తమయున్నతిమార్గముల నారయుటలేదని వినిన చాల చింతగనున్నది.

కేవలవిద్యావిషయ మట్లుండ స్త్రీలకెత్తిపై మఱి కొన్ని బాధ్యతలు కలవు:—ఓటింగ్ పవర్, హరిజన సమస్య, వారసత్వము, దాయభాగపుహక్కు, విడాకులచట్టము, అనునవి వారినిప్పటత్రిప్పలుపెట్టు ముఖ్య

సమస్యలు. ఓటింగ్ పవర్:–దీనిచే స్త్రీ తనసాంఘిక, రాజకీయ జీవితాశయములందు యత్నించి పూర్ణ సిద్ధినిఁబడయుటకు వీలుకలదు. కేవలము శాసన సభార్హతగల పురుషుల దయాధర్మభిక్షములపై నాధారపడియున్న మన కోరికలు ఇయ్యదనుక మనకు స్వయంకృషివలన లభింపనైయున్నవి. మన హక్కులను మనకు సంపాదించి పెట్టలేదని పురుషులను నెపమెన్నుకంటె చేఁజిక్కిన ఈ యవకాశమును పురస్కరించుకొని దిట్టలగు స్త్రీలను పోటీలలో గెల్పించి ప్రభుత్వమునుండి వారసత్వపు, దాయభాగపు హక్కులెయున్నను వానిని మనమే సంపాదించుకొన ప్రయత్నింపవచ్చును. అటుపై మన ప్రాప్తి! ప్రభుత్వమువారి దయ!

హరిజనులతోడి కలయిక:–ఇందు పురుషులకంటె స్త్రీలదే యెక్కువబాధ్యతయనునది నిర్వివాదాంశము. ఇది ఆచారము పేరిట పూజింపఁబడు హీనకులమానవ మారణపిశాచి. ఇప్పటి ఆచారమునుబట్టి దీనినివెడల నడచుటయే మేలు. ఏరెండకాగొడుగు బట్టినఁగాని సుఖములేదు. ఈవిషయమున సాధ్యమునువదలి స్త్రీలు తమ యౌదార్యమును గనఁబఱతురుగాక.

విడాకులచట్టము:—ఇది యొక కొఱుకుపడని కొయ్య, పచ్చివెలగకాయవలె గొంతుముడి! హిందూదేశమునఁ గొందఱు ఘాతుకపురుషుల, యధికారమూలకదౌర్జన్యమునకు, నిశ్శబ్దముగ, నిరాఘాటముగ బలిదానమైపోవుచున్న అబలలనుగూర్చి, యాలోచించుచో నిట్టి చట్టము అవసరమనిపించును. ఎన్ని అనాఘ్రాతసుందరకుసుమముల్ భర్తృవిప్రోషితాది దురాగతాతపముక్రింద వాడివత్తలైరాలి, నేలఁదొరలిపోవుచున్నవో ఏరికెఱుక! ఇట్లు "యావజ్జీవం హోష్యామి"యను తనముద్దుబిడ్డల దుస్స్థితికి భారతాంబిక యెంతవగచుచున్నదో? ఒక్కొకపరి యీమున్నీరంతయుఁ దిరిపమెత్తుటకును, దిక్కుదివాణములులేక, దీనలై యుల్లలనాడుచుఁ దనకునురుగొట్టునట్లు వాపోవు తనపసికందుల నీచస్థితిఁ జాలిగదురవగచి, గుండెఁబగులనేడ్చి విడిచిన కన్నీరనితోచును. కాని యీచట్టమునందొకింత యవినీతి కడమున్నది. పురుషులకు స్త్రీలను బాధించుటకు, విడచుటకు, భార్యయుండఁగా మఱల పెండ్లియాడుటకు వీలులేకుండ ప్రభుత్వము చట్టమూలముగ శాసించి తదతిక్రమణ సేసినవారిని గాటముగ శిక్షించుచో నీపశుబలమణఁగి ఘాతుకపురుషులు కోరదీసిన పాములవలె సద్వర్తనులైయుందురేమో.

ఇట్టి సమస్యలన్నియు స్వయంవిచారణశక్తిగల విద్యావతీలోకముచేఁ జక్కఁగ బరిష్కరింపఁబడఁగలవని యాశించుచున్నాను.

ఈ మండలివిధానము బాగుగ నేయున్నది. కేవల ఆటలకే తావీయక, పుణ్యప్రదమగు సారస్వత కాలక్షేపము జరుపఁబడుచున్నది. దీనిచే స్త్రీలకు, శారీరక, మానసికశక్తులు రెండును వికాసమునొందుచున్నవి. కాని యిదిచాలదు ఇతోఽధికముగ విద్యాకృషి జరుగవలయును. "నోరున్న నూళ్లేలవచ్చు" ననునట్లు స్త్రీలోకమెకించుక ధారాళమగు నుపన్యాసశక్తి యలవఱచుకొనవలయును.

శతేషుజాయతే శూరః, సహస్రేషుచపండితః।
దాతాభవతి కోటీషు, వక్తాభవతిదుర్లభః॥

అనిరి. కాని "కృషితోనాస్తి దుర్భిక్షమ్" వక్తృత్వశక్తి చాలగొప్పది. దానిమూలమున నెన్నిప్రతికూలశక్తులనైనను అనుకూలమొనర్చుకోవచ్చును. గాంధీజీని తీవ్రప్రతికూల వాతావరణమున జయింపఁజేయునది ఈశక్తియే. కాన నొక వాగ్వర్ధనీసభ శాఖను లేవఁదీయుట మంచిది. కత్తిపోటుకంటె కలముపోటు గొప్పది. కావఁ దఱచు వ్యాసపుపోటీలను జరుపుచుండవలయును. ఇందు గ్రంథములసంఖ్య చాల తక్కువగనున్నది. దానిని పెంపొందించుటకు ముఖ్యము, ఇంతియకాక ఆనందప్రదమును, ఇహపరసాధకమును

నగు సంగీతమునకును, సఫలప్రేప్సుకర్మలగు లలిత కళలకును తావొసంగిన బాగుగనుండును. వీనివలన స్త్రీమండలి కీమండలివలన నిప్పటికంటె నెక్కువ మేలుకలుగఁగలదు. కాని "ధనమూలమిదమ్ జగత్." ఇది యందఱును గ్రహించిన విషయమే. ధనాభావమే, అభివృద్ధ్యభావమునకు కారణమనివినుటకు మిక్కిలి విచారముగనున్నది. మనధనముచే మనలనేబాగుపఱచు నిట్టిసంస్థలకు ధనమిచ్చి దానివలన నింతింతనరాని జ్ఞానఫలమునొంది హాయిమైసుఖింత్రుగాత.

మండలి కార్యదర్శిని శ్రీమతి వరలక్ష్మమ్మగారు కడుదక్షురాలు. ఆమె పూనుకొని యీపనుల నిర్వహింతురని నమ్ముచున్నాను. మనమందఱ మామెకుఁ దోడ్పడుట విధియని మనవిచేయుచున్నాను.

---

## మొల్ల

కొడాలి వెంకటరాజారావుగారు

పుట్టినవారిలోన నిక పుట్టగఁ బోయెడివారిలోన నీ
యట్టి కవిత్వసంపదగలట్టి మహాకవయిత్రు లాంధ్రభూ
ఘట్టములోపలన్ వెదుకఁ గానగరా రొకరైన మచ్చుకై
ఇట్టి కవిత్వభాగ్యము వరించె నినున్ తొలిజన్మపుణ్యమై.

తెలుఁగు భూభాగదిగ్భిత్తి కలకునడుమ
నీయశస్సులు పాలవెన్నెలలు కాయ
సర్వకవయిత్రులును హర్ష సాగరమునఁ
దేలుచుండిరో మొల్ల! త్వత్కృతిఫలాన.

చెఱకురసమ్ము చిప్పిలెడు జీవమునిల్చిన నీకవిత్వమే
ఉరుతరపూత భావపదయుక్తమునై అతిభక్తిపూరమై
పరమపవిత్రులీ తెలుఁగువారి గళాల పురాణకావ్యమై
తరలును బాహ్యమై రుచులు త్రచ్చగఁబడ్డ ప్రహృష్టగీతులై.

# ఆశీస్సులు

శ్రీ హితైషిణీమండలి ఆఱవ వార్షికోత్సవసమయమున

శ్రీయుత చంద్రమౌళి చిదంబరరావు పంతులుగారు పంపినవి

చ. వనితలు మౌఢ్యదుర్దశను బాసి జగద్వ్యవహారవైఖరుల్
గని మతనీతిధర్మములఁ గన్గొని జ్ఞానలవంబునొందఁగా
ననువగు విద్యలంబడసి యంగన లుల్లసిలంగ జేయఁగా
జననముగాంచితీవు బుధసన్నుతవర్తని శ్రీహితైషిణీ.

ఉ. ఇప్పటి కాఱుహాయనములేగెను నీవిటజన్మమంది య
ప్పప్పయటంచు ముద్దునుడు లల్లననాడుచు నాటపాటలం
దొప్పులకుప్పవై దినదినోత్తరవృద్ధివహించి మించి భా
వప్పురానరాణగనుమా, మనుమాసతతంబుమండలీ.

సీ॥ సుందరాకృతులతో శోభిలు వస్తుప్రదర్శనశాలవై దనరినావు
ఆటపాటలనేర్పి పాటలగంధుల కెంతయో ముదముగల్గించినావు
జన్మోత్సవంబుల సంతోషమునసల్పి యింతుల చాలమెప్పించినావు
నిలువనీడయెలేక నిలచినేటికినొక్క నెలవుసంపాదింపగలిగినావు

గీ. సప్తమాబ్దోత్సవమువచ్చు సమయమునకు
విమలకళ్యాణసంపద విస్తరిల్ల
గృహిణివై మోదమెసఁగ స్వగృహముగనుము
శ్రీహితైషిణీమండలీ! చిత్తమలర.

సీ॥ జ్ఞానసుధల్చిందు సద్గ్రంథసంపత్తి నెంతయుశక్తి నార్జింపుమమ్మ
బహువిధార్థంబుల ప్రకటించు పత్రికారత్నసంచయము గూర్పంగదమ్మ
బాలామనోహరలీల నొప్పారెడు చిత్రవస్తుచయంబు జేర్పుమమ్మ
మతనీతి దేశాభిమానభావంబుల నింతులకెల్ల బోధింపుమమ్మ

గీ. శ్రీజనహితైషిణీ కార్యచింతతోడ
సంతతజ్ఞానవృద్ధియే సంఘటింప
యత్నములజేసి దేశవిఖ్యాతిగాంచి
శ్రీహితైషిణీమండలీ వెలగుమమ్మ.

VERY HEAVY CAKE SIR, SO I COULD NOT WALK FAST

I HAVE BEEN WAITING FOR THE BATH YOU FOOL!

స్త్రీలందరు గమనించండి.

స్వస్తిక

"కాంతి"

కుటుంబములో అందరికి ఉపయోగపడే పెద్ద సబ్బుబిళ్ల. మనోహరమైన సువాసనతో కూడింది.

Kanti

SWASTIK OIL MILLS LTD. BOMBAY.

P.C.DUTT

డిస్ట్రిబ్యూటర్లు ప్రతిజిల్లాయందును గలరు.

బెజవాడ:—స్టేపనరి అండు ఫాన్సీమార్టు. కాకినాడ:—చిత్తూరి రంగయ్య అండు కంపెని.

విశాఖపట్నం:—బాంబే ట్రేడింగు కంపెని.

స్వస్తిక్ ఆయిల్ మిల్స్ లిమిటెడ్,

బొంబాయి. 15

# సినిమారంగము—కన్నాంబ

వెల్లాల ఉమామహేశ్వరుడుగారు

ఆంధ్రదేశమునందుకూడ నేడుసినిమాలు తామరతంపరగా లేచినవి. గొంతెత్తి గట్టిగా దీర్ఘముగా పాడగలవారందరును సినిమా నటీనటులగుచున్నారు. పాత్రౌచితినిబట్టి రూపము, వేషము, అభినయసామర్థ్యము—ఏదిలేకున్నను పాడగలిగినజాలు సినిమా స్టారగుటకు! అసంగీతమైనను కష్టపడినేర్చి, స్వక్రమముగ శాస్త్రీయముగ పాడిరా, "పోనీ ఇది పాటకచ్చేరి" యనుకొందుము. తమిళు లును హిందూస్థానీయులును మధ్యమశ్రుతిని మధురగానముచేసి సభ్యులనానందవార్ధిని ముంచెత్తుచున్నారు. రెంటికిని జెడిన మన యాంధ్రులు 'హా'యని సముద్రఘోషవలె ప్రథమపాదము నెక్కడనో ఆకాశమున నారంభింతురు. రెండవపాదము వచ్చుసరి కథఃపతనము. వీరి హార్మోనియము నాదము పుంజు పైన గాజుతో గీచినట్లు వేదన కలిగించునదిగా నున్నది. హిందూస్థానీయులు శాస్త్రబద్ధికా రముచేసినను ఎట్టిచో ఏ సన్నివేశమున ఏ రాగముపాడిన హృదయాకర్షకమై నటుడు వెల్లడింపబూనిన భావోద్రేకము మనలో కలిగించి తన్మయులజేయునో ఆయాసన్ని వేశముల నట్టి రాగమును పాడుదురు. ఆ పాడుటయు నాయాపాత్రలుకాదు, నే పథ్యసంగీతమే! ఇది సినిమాకళకు మిక్కిలి వికాసము నిచ్చుచున్నది. తమిళులకు శవ దహనమునకుకూడ స్వరకల్పన తప్పని సరియై నది. మనకేదియులేదు. ఉభయభ్రష్టత్వము!

ఇట్లు తుపాను ననుకరించుచున్న మన తెలుగు సినిమాకాశరంగమున శ్రీమతి కన్నాంబ మినుకుమినుకని ప్రకాశించు తారయై, ఆంధ్రులలోకూడ ప్రపంచకీర్తి బడయగల నటీమణులున్నారను నాస గొలుపుచున్నది. ఈమెను నేను "ద్రౌపదీ వస్త్రాపహరణము"నందును, "కనకతార" యందును మాత్రమే చూచుట తటస్థించినది. ఒకదాన ద్రౌపదీపాత్రను రెండవదానిలో కమలపాత్రను జేకొని ఈమె సహృదయ ప్రశంసాపాత్రముగ నిర్వహించినది.

ఎక్కువతక్కువలులేక తగిన ఉన్నతి, పోజులో ఫోటోతీసినను వికారముగాక ఆకర్ష ణీయమగు ముఖము (Screem-face) ఎంతటి సౌమ్యోద్రేక భావములనేని తుదతెప్పల లోనే వెల్లడింపగల విశాల నేత్రములు, మిక్కిలి మధురమగు కంఠమునుగలిగి కన్నాంబ ఎల్లవిధములను ఉత్తమ నారీపాత్ర ధారణకు తగియున్నది.

ఈమెలో ఒక విశేషముకలదు—సాధా రణముగా పాడునప్పుడు మనముఖములలో వేయిముడుతలుపడి, ఏభావప్రకటచేయు నుద్దేశముతో పాడిననుసరే ఉపాధ్యాయునిచే తొడబెల్లము పెట్టబడుచున్న బాలుని బాధా సూచక ముఖమువలె నుండును. కన్నాంబ విషయమున నట్లుకాదు. పాడునప్పుడిట్టి వికారవుముడుత లామెముఖమున నుండవు. దేహము తిరిగి సుళ్లుచుట్టదు. ఈ గొప్ప

గుణముకలవారు చాలఅరుదు. ఈగుణము కల్గబట్టియే కన్నాంబ బొత్తిగా సంగీత ప్రశంస చేయగూడని ఘట్టములలోపాడి "భేష్" అనిపించుకొన్నది. ద్రౌపదిని సభ కీడ్చితెచ్చిన ఘట్టమునుచూడుడు. అది మద్దెలతాళశ్రుతుల కలయికతో ఖతను ద్రొక్కి పాడవలసిన యదనేనా? కాదు. ముమ్మాటికిని కాదు. అట్టిచో 'ఇది సహింతురా' అని ఒకపాట నక్కడ డైరక్టరుగారు చొప్పించిరి. కాని మంచి భావనాశక్తికలిగి తన్మయీభవనము పొందగలిగిన కన్నాంబ గద్గదకంఠముతో దీనత్వము, అభిమానము ఉట్టిపడుకన్నులతో, కనుమూసి తెఱచినంతకాలములో తాను వివస్త్రయై మానము మంటగలయునే యన్నభీతితో, ఇదియంతయు గాంచుచు నూరకున్న సభికులనుద్దేశించి ఈపాటనే యేడ్పుగామార్చి హృదయములు కరగించివైచినది. అన్ని భావము లనేకముచేయు ముడుతల నడచు శక్తి యిట నామెకు చాల తోడుపడినది. తరువాత వస్త్రాపహరణ సమయమున 'హే ద్వారకావాసా' యని ఎన్నిమారులు చూచినను కన్నుల నీరుగార్పించున ట్లభినయించినది. భావముల నింతసహజముగ ప్రదర్శించువారు మిక్కిలి అరుదు. చూచుచుండగనే ఆమెకన్నులలో వివిధభావములు తిరిగిపోవుచుండును. వస్త్రాపహరణ ప్రయత్నము విఫలముకాగానే, శ్రీకృష్ణస్మరణము సేయుచు "పాండుకుమార బంధానమో" అనునప్పు డామెకన్నులలో, కపోలములలో, ఉచ్చారణలో ఉబికిన అప్రమేయమగు కృతజ్ఞతానంతోషములు తలచినంతనే పులకలెత్తించునవి. ఎన్నటికిని మరవురానివి. ఇట్లెన్నిఘట్టము లేకరువు పెట్టగలము? కనకతారనుండి యొకటి—కమలను ఉరితీయుమని ఆజ్ఞయైనది. ఉరికంబముకడ కామెను తెచ్చినారు. కడసారి దైవ ప్రార్థనము కానిమ్మనినారు. ఈకడసారిప్రార్థన సహజముగ వచనముననే సాగించియుండిన కన్నాంబ భావప్రకటనమెంత యుత్కృష్టమై యుండెడిదో ఊహ్యము. దానిని చూచు భాగ్యము డైరెక్టరుగారు మనకు గలిగింపరైరి. ఇట్టియెడగూడ సీసపద్యమును పాడించిరి. కాని అప్పటికమల యవస్థ ననుభవించుచున్న కన్నాంబకు అసహజములగు సంకెళ్ళెన్ని తగిలించినను ఆమె యుత్తమ నటీత్వమును నిలబెట్టుకొన్నది. పాటతో భావమును మఱుగుపఱచనిచ్చినది కాదు. చూపరులహృదయముల గదలింపక వదలినదికాదు. సాధారణుల కీజయము సాధ్యమును కాదు!

గమనింపదగిన దింకొక్కవిషయము. అది ప్రపంచవిఖ్యాత నటకులకుకూడ చాల కష్టమైనది. ఏదన—నిండుగా గాలి కొట్టబడిన రబ్బరుతిత్తి సూదితో పొడిచినంతనే దానిని చీల్చిపగిల్చి గాలి ఎట్లు వెలికి తీవ్రవేగమున ద్రోసికొనివచ్చునో, అట్లు లోన దాగియున్న కొంతంత యుద్రేక మొక్కమాటకొనే వెల్లడించుట. ఈశక్తిగలవారే ఉత్తమ నటీనటులు. దీనిని నాట్యకళా

ప్రపూర్ణులు గుర్తగొనిరి. "ద్రౌపదిమాన సంరక్షణము"న నీళ్ళలోకూలబడి ద్రౌపది యంతఃపురకాంతల చప్పట్లచే అవమాన సముద్రమున ముంచబడిన మహాభిమాని దుర్యోధనునిభావము వెల్లడించునప్పటి వారి ముఖాభినయము నిరుపమానము. పదపడి శకునితో తన హృదయవేదన ద్యోతక ముగా "ప్రాణమునకు కాదుమామా! మానమునకు గాయముతగిలినది" అను నప్పటి ఆ కంఠము. ఆ నయనములు ఆ ముఖ భావములు శ్రీ నాట్యకళాప్రపూర్ణులకుగాక ఇంకెరికి చూపనలవియగును? ఈ యద్భుత శక్తినే "ద్రౌపదీ వస్త్రాపహరణము"న కన్నాంబ యొకచో ప్రదర్శించినది. ఇక్కడ సభలో ధర్మజుడు క్రమక్రమముగానన్నియు ఓడుచున్నాడు. ఈవార్త నిమిషనిమిషమున కును అంతిపురినున్న ద్రౌపది కందుచున్నది. తుదకు రాజ్యమంతయు నోడుట తెలిసినది. అప్పుడు "దిక్కెవ్వరులేరా" యని వేట కానిచేత బడిపోవుచున్న విభీతహరిణీస్వర ముంబోని యార్తస్వరమున ఈ యారక్షర ములలో కన్నాంబ ప్రదర్శించిన భయము, దుఃఖము, "ఉన్నాడు. భగవంతు డున్నా" డన్న నమ్మకము—ఏమనవచ్చును. చూడనే వలయునుకాని, వర్ణింప నలవికాదు!

ఇట్టి యుత్తమ నటీరత్నము మన భాగ్య వశమున నబ్బినది. ఈమెకు భావనాశక్తి కలదు. తన్మయీభావనముకలదు. ఉత్తమ నటులకు వలయునన్ని గుణములునున్నవి. కాని, ఒక్కకొరత. సమర్థుడగు డైరెక్టరు లేడు. నాట్యకళాప్రపూర్ణుని డైరెక్షనుక్రింద ఈమెనటించెనా సంగీతములేక ఇప్పటి కొన్ని హిందూస్థానివారి ఫిల్ములును, పాశ్చాత్యఫిల్ములును ఎట్లుత్తమము అని పించుకొన్నవో మన తెలుగుటాకీలును అట్లే యుత్తమము లనిపించుకొనును. ఉద్రిక్తభావ ముల నింతచక్కగా ప్రదర్శించువారు లేకుండుటచేతనే సంగీతసాహాయ్యమున జనుల నాకర్షించుప్రయత్నము. తన్మూల మున కళ ఖూనీయైనది. ఈనటీనటులు నూటికి తొంబదిమంది జీవనార్థమే సినిమా త్రొక్కినవారు. ఇంక వారి కాళ్లక్రింద కళ నలిగిపోకేమున్నది! పాత్ర తత్వముకాని, చదువుకాని వారికిలేదు. ఒకవేళ నివి యుండెపో, ప్రదర్శించుశక్తిలేదు. భావన లేదు. తన్మయత్వము సున్న. పాటయే సర్వమునై నప్పు డిన్నిటితో నేమిపని? డైరెక్టరైనను ఆదర్శములగు టాకీలను తయారుచేయు నిచ్ఛయేని కలవారుకారైరి. "విజయదశమి"లో విరాటునాస్థానమున మల్లురజూడుడు. వారికండరములు పెనవేసిన కపిలమోకులవలె నున్నవి. కీచకుడు సింహ బలుడు! ఆయనశరీరము చాల బలిష్ఠము గానే ఉన్నది. కాని, "ఈమల్లురలో నొక్కనికాని, లేక అందఱగాని ఓడించెద" నన్న భీముడు, సింహబలుని సంహారించిన భీముడు చాకలదాని మైలబట్టల మూటవలె నున్నాడు. "కృష్ణలీల"లో కృష్ణవిగ్రహము జూడుడు. ఇంటింట వెన్నముద్దలమింగి గుండుదేరి నున్ననై, ప్రకృతిసౌందర్య

మంతయు మూ ర్తీభవించిన కృష్ణపాత్ర ధార ణకు, మెడికల్ కాలేజి ల్యాబలేటరీలోనున్న కంకాళమువంటివాని నొక్కని దేచ్చినారు. ఏల? దీర్ఘము, అవసరమగు సంగీతము తీయగలడు కాన. ఇట్లు బహిరాకారము నైన గణింపని మనడైరక్టర్లు ఇంక దేనిని గణింతురు? ఇట్టియెడ వీధినాటకములకన్న గోడుగానున్న టాకీలుగాక కళాభిపోషకము లెట్లు కలుగును? కాబట్టి కన్నాంబవంటి నటికల్గియు, తగినడైరక్టర్లు లేని మన యాంధ్రులదౌర్భాగ్య మేమనవలయు?

---

## ని వే ద న ము

శ్రీమతి విం. వేంకటరత్నమ్మగారు

దేవ! మహితప్రభావ! ప్రదీప్తభావ!
లలిత దివ్యకరుణ రసప్లావితంబు
నవిరళశుభదంబు భవదీయాననంబు
కండ్లయెదుటఁ గన్పట్టు భాగ్యంబునాకు
దవ్వుగాఁదోఁచు; నాదురితంబుపేర్మి
నిత్యమంగళప్రదమైన నీదుమంది
రప్రవేశార్గళంబు నేర్పడియెనాకు.

ఎన్నిమాఱులు నేవచ్చియున్నఁగాని
గణగణన్మ్రోఁగు గంటలం గ్రాలునీదు
నాలయకవాటయుగముమూయంగఁబడియె
ప్రతిహతాశనై దుఃఖపూర్ణహృదయనయి
పల్మఱు మరలిపోయితిం బనవివనవి.

పుట్టినింటికి మఱిమెట్టినట్టియింటి
కీవెగా యిలువేల్పవై యెల్లవేళఁ
గంటికిన్ ఱెప్పపోలికం గాచుచుందు;

వేదియే నపరాధంబు నేముచేసి
యున్నఁగాని క్షమాగుణయుక్తినైఁచి,
భక్తిమై భవత్పాదసేవలనొనర్చు
మమ్ముఁ గెంపుఁజూపులఁ జూడకెమ్మెమీఱ
దివ్యసందర్శనమొసంగి తేర్పుమయ్య!

నాహృదయ పంచపాత్రికన్ బదిలపఱచి
భక్తిగంధంబు, వినయపుష్పములు, బహుళ
హర్షనామాక్షత, లనురాగామృతంబు,
నాత్మనై వేద్యముంగొని యరుగుఁదెంచి
యుంటి నెన్నియోసార్లు; గంటనైనఁ
జూడవేలొకో, నాయెకిమీఁద! తెల్పు.

ప్రాణమాత్రావశిష్టనై రక్షణంబు
గోరునాశ్రితన్; గావ నేతేరుమయ్య!
'అన్యథాశరణన్నాస్తి' యని, 'త్వమేవ
మమశరణ'మని పల్కు నామాటవినుమ!

# కాశ్మీరము
—2

జి. వి. చలపతి నాయుడుగారు

హిమాలయపర్వతములయందు పశ్చిమోత్తరమున స్వాభావికజనకములై విచిత్రదర్శనీయములగుచు శాశ్వత హిమపరివృతములై దట్టమగు అడవులకు నిలయమై భోగపరులకు సర్వసంపదల తేజూర్చ్యము విశాలమగు పచ్చికబయళ్లు భూమిలోనుండి పైకెగిరి నృత్యమాడుచుండు నీటిధారలు కొండలపైనుండి క్రిందికి దుముకుచుండు జలపాతములు, తామరలచే అల్లియున్న మంచి నీటిసరస్సులు, పాముజాడవలె వంకరలుగా ప్రవహించు నదులు, అడవిబూరుగ వృక్షము లిరుప్రక్కల బారులు దీరియున్న రాజబాటలు, సుందరవనములు, మధురవంతములై మనోజ్ఞములగు పండ్లు, పూలుగల తోటలుగలిగి యింత చిన్న భూభాగమునందు అనేక విచిత్రములతో శోభాయమానమగు ప్రదేశము ప్రపంచమునందు వేరొండు లేక విరాజిల్లుచున్నది.

సుఖకరమగు చల్లదనము, ఆనందదాయకములగు ప్రయాణములు, ఇతర కొండనివాసములకంటె చౌకగాలభించు ప్రయాణసౌకర్యములు నదులయందును, తామరలచే కప్పబడిన సరస్సులయందును నావగృహములమీద, మోటారులాంచీలమీద, జరినీపని చేయబడిన వస్త్రములతో అలంకరించిన చిన్నపడవల మీదను రస్తాలపై టంకాలు, సైకిల్సు, మోటారుకార్లు, మీదను, దూరపుకొండ ప్రదేశములలో గుఱ్ఱములమీదను, కాలినడకతోను తిరుగుచుండు పథికులకు ప్రతిఅడుగునకును సృష్టివైచిత్ర్యము ఆనందము గొల్పుచుండును.

ఈ స్వదేశసంస్థానము మానవునియొక్క అన్ని అభిరుచులను, ఇచ్ఛలను సంతృప్తిగా బొందుటకు తగిన ప్రదేశము. యోగనిష్ఠాగరిష్ఠులగు నిర్గుణారాధనపరులకు నిశ్శబ్దమై, నిర్మలమై, మనోచంచల నివారణమై, తాపహారమై సర్వదా మనోశాంతి నొసంగుచుండును. సృష్టిచిత్రములమధ్య నవదంపతులను సర్వసంపదలయందు సంతుష్టాంతరంగులుగ జేయుచుండును. ప్రకృతిశాస్త్రజ్ఞుడు, ప్రతిఅడుగునకును ప్రతిపుష్పము, లత, గుబురు, వృక్షము, కాయ, పండు మొదలగు వానియొక్క సహజనైజములగు సృష్టికి పరమాద్భుతము నొందుచు భగవంతుని వేనోళ్ల బొగడుచుండును. వేటకాండ్రు తమ తుపాకులను, విల్లునమ్ములను తీసుకొని కుక్కలను వెంటబెట్టుకొని స్వేచ్ఛావిహారముల సల్పుచుండు మృగములను, పక్షులను వధించి ఆనందము బొందుచుందురు. జాలరులు మంచి కాసారములలో విచ్చలవిడిగా సంచరించు మత్స్యముల వేటాడి మురియుచుందురు. గగనచుంబితములగు కొండశిఖరములందును కొండగుహలయందునుగల అనేక పుణ్యక్షేత్రముల సందర్శించుటకు హిందూదేశమునందన్ని భాగములనుండి వేనవేలుగా అరుదెంచు యాత్రికులు మనోరథముల నీడేర్చుకొనుచుందురు. భూగర్భశాస్త్రజ్ఞుని హృదయము ఈ విశాలపర్వతగర్భములయందు నెట్టి ఖనిజసంపత్తిగలదో యను విచక్షణలో నిమగ్నమై పరిశోధనకు గడంగుచుండును. ఇచ్చటి వర్తకసంబంధమగు మర్మములలో పరదేశవర్తకులు ఎగుమతి వ్యాపారమార్గము లరయుట కష్టతరము.

ఇచ్చట అరణ్యములు గృహోపకరణములకు, రైల్వేస్లీపర్లకు వలయు శ్రేష్ఠమగు కొయ్యసామగ్రిని అపారిగా నొసంగుచుండుటయేగాక సారవంతములగు అమూల్యౌషధీలతల సంపదను విరివిగా గలిగియుండును. ఎలుగుబంట్లు, చిఱుతపులులు, కస్తూరిమృగములు, దుప్పులు, నక్కలు మొదలగు వనమృగముల చర్మములు వెల్వెట్టువలె మిక్కిలి మృదువై యుండును. ఆవులు, మేకలు, రుచ్యములగు ఆరోగ్యవంతమైన

పాలను విరివిగా నిచ్చుచుండును. మాధుర్యమగు పండ్లదినుసులు పండినవి, యెండినవి, విఃక్కటముగా లభించును, కాశ్మీరదేశమున అక్టోబరుమాసములో పుష్పిత కుంకుమపువ్వుచెట్లను మానవుడు తన జీవిత కాలమున నొక్కమారైనను చూచి, ఆఘ్రాణించి పరమానందమును అనుభవించి తీరవలెను. కొండలు మీద మేడలు మేడలుగా కయ్యలు జేసి పర్వతముల మీదనుండి యెండకుకరిగి జారుచుండెడు మంచు నీటితో పలువిధములగు వరిపైర్లను విశేషముగా సాగుచేసెదరు. శ్రీనగరునందుగల డల్ సరస్సునీటితో సాగుచేయు నానావిధములగు కాయగూరలు ప్రపంచమునందన్నిచోట్లకంటే యిచ్చట చౌకగాలభించును.

పట్టుపురుగులను, గొర్రెలను విశేషముగా పెంచెదరు. ప్రపంచమున ప్రసిద్ధివహించిన కాశ్మీరశాలువలు, పలురంగుల అంచులు చిత్రవిచిత్రముగా అల్లిన ఉన్నివస్త్రములు, పట్టు, ప్రతిసంవత్సరము కొన్నిలక్షల రూపాయలు వెల గలిగినవి ప్రపంచములో అన్నిభాగములకు ఎగుమతి అగుచుండును. జర్మని దేశమునుండి దిగుమతిచేసిన శాలువలకు అంచులుకట్టి మారుబేరముజేయు వాడుకయు కొందరు వర్తకులవద్ద కలదు. అఖిలభారతచరఖాసంఘమువారు కొన్ని రాట్నములు, మగ్గములు పెట్టించి వస్త్రములు తయారుచేయించి విక్రయించు దుకాణమును శ్రీనగర్‌లో అమీరాకదల్ అను మొదటివంతెనవద్ద హరిసింగ్ రోడ్డులో ఉంచివున్నారు. వీరివద్ద సరి అయిన వెలలకు నమ్మకమైన కల్తిలేని వస్త్రములు దొరకును.

ఇచ్చట జనవరి–ఫిబ్రవరి నెలలో మంచుకాలము, మార్చి – యేప్రెలు నెలలో పూలుపడుకాలమందురు అనగా మంచుకణములు చెట్లమీదనుండి పూలవలె రాలుచుండును. మే–జూన్ నెలలో తొలకరికాలము. చెట్లుచిగిరించుట పుష్పించుట ప్రారంభమగును, ప్రేక్షకులరుదెంచుటయు ప్రారంభమగును. జూలై-ఆగస్టులయందు వేసవికాలము. ఈ కాలమున గొప్పవర్షములు కూడా పడుచుండును. సెప్టెంబరు - అక్టోబరులలో వేసవి అంతము, చలి ప్రారంభము. మానవుని జీవితమునందు చూచి ఆనందించవలసిన కుంకుమపువ్వుచెట్లు పుష్పించు మనోహరఋతువిదియె. నవంబరు - డిసంబరులందు ఆకురాలుకాలము (శరదృతువు). సామాన్యముగా జనవరి నెలలో 45 డిగ్రీలు ఉష్ణముతో ప్రారంభించి జూలైలో 95 డిగ్రిలవరకు పెరిగి డిసంబరులో తిరిగి 45 కు దిగును. కొన్నిసమయములందు డిసంబరు – జనవరిమాసములలో 15 డిగ్రిలకు తగ్గియుండునట. సరాసరి సంవత్సరమునకు 30 పదునులు వర్షముకురియును. యీదేశము 84516 చదరపుమైళ్ల వైశాల్యమును, 3646243 జనసంఖ్యయు, రెండుకోట్లు యాభైలక్షలు సంవత్సరపువరుంబడియు గలిగియున్నది. ప్రస్తుత మహారాజా హరిసింగ్, ప్రధానమంత్రి గోపాలస్వామి అయ్యంగారు. (మద్రాసు రివిన్యూబోర్డు కమీషనర్‌గా ఉండినవారు).

ఎక్కువపని తక్కువవిశ్రాంతిగల యీకాలమున ఆనందనిలయమగు నీచల్లని భూలోకస్వర్గమును కనులపండువుగా తిలకించి మెదడుకు, హృదయమునకు, శరీరమునకు, చక్కనివిశ్రాంతిని, బలమును చేకూర్చుకొనుట ప్రతిమానవునకు అత్యంతవసరము.

స్వతంత్రరాజ్యమగు నీ కాశ్మీరదేశమునకు రెండురాజధాని నగరములుగలవు. ఏప్రెలు నెల మొదలు అక్టోబరువరకు కొండలోయలో సముద్రమట్టమీద 5200 అడుగుల యెత్తుగల విశాలప్రదేశమగు శ్రీనగర్ నందును, నవంబరు మొదలు మార్చి నెలవరకు చలికాలములో కొండలక్రింది భూభాగమున సముద్రమట్టమీద 1000 అడుగుల యెత్తులోగల జమ్ముటావియందును కాశ్మీరమహారాజాగారు నివాసములుగలిగి వారి రాజకార్యకచ్చేరీలు అన్నియు ఆ యాకాలములలో ఆ యాప్రదేశములందును జరుపుచుందురు.

వేసవి రాజధానియగు శ్రీనగర్ కుపోవుటకు రెండు ముఖ్యమైన మార్గములుగలవు.

1. రావల్పిండి 196 మైళ్లు.
2. జమ్ముటావినుండి 206 మైళ్లు.

రెండుమార్గములందును చక్కనిబాటలు. పోస్టు టెల్రిగ్రాం, డాక్ బంగళాలు మొదలగు సౌఖకర్యములుగలవు.

## రావల్పిండి మార్గము 196 మైళ్లు

రావల్పిండి సముద్రమట్టమునీాద 1725 అడుగుల యెత్తులో గలదు. గొప్పపట్టణము. ప్రయాణీకులు బసచేయుటకు వలయు సౌకర్యములన్నియు సమగ్రముగా గలవు. ఇచ్చట నార్తువెస్టు రైల్వే స్టేషన్ గలదు. (N. W. Ry.) రైలునుండి స్టేషన్‌లో దిగగానే మోటార్లువడపు కంపెనీలవారు ప్రయాణికుల చుట్టు మూగెదరు. ఏదో యొక కంపెనీవారితో యేర్పాటు జేసికొనినతోడనే ఇచ్చట ఎండ వేడిమి అధికముగానుండుటవలనను కాశ్మీరము చూడవలెనని హృదయము త్వరపడుచుండుటవలనను తొందరగా ప్రయాణము సాగించుటకు నుద్యమింతురు. పట్టణములోని కొన్నివీధులు దాటినతరువాత ఇరుప్రక్కలవరుస చెట్లతో కాశ్మీరబాట ప్రారంభమై 14 మైళ్లు వెళ్లినతరువాత

## బారకాయ్

గ్రామము. సముద్రమట్టమునీాద 1800 అడుగుల యెత్తుననున్నది. ఇది ముఖ్యమగు బ్రిటిష్‌సైన్య నివాసస్థానము. ఇచ్చటనుండి బాట వంకరగా ఎక్కుడు ప్రారంభమై మూడుమైళ్లు పోయినతరువాత

## సత్రామైల్

వచ్చును. ఇది 2000 అడుగుల యెత్తులోనున్నది. ఈప్రాంతమున ఎండిపట్లుండు రాతికొండలలో అచ్చటచ్చట ముండ్లుచెట్ల పొదలుండును. తరువాత రెండుమైళ్లుపోగా

## చ్యాటర్

2100 అడుగుల యెత్తు. ఇచ్చట పెలయేరొడ్డున సొగసైన పండ్లతోట గలదు. విశ్రాంతికి సౌకర్యముగానుండును. ఈమార్గములో రస్తా చాల దగ్గర దగ్గర వంకరలు తిరుగుచుండును. గాన అపాయము కలుగకుండుటకై మోటారును మెల్లగా నడపెదరు. ఈ యెక్కుడుబాటలో సాల్రిగ్రాం వంతెన దాటిన దాది యెత్తుకొండలలో అచ్చటచ్చట పొడుగుపాటి చెట్లుగల దారివచ్చును. 7 మైళ్లు దాటినతరువాత

## క్రెటక్

గ్రామము 4000 అడుగుల యెత్తులోనున్నది. ఇచ్చట డాక్ బంగళా యున్నది. కొన్ని డేరాలు వేయబడియుండును. దారిప్రక్కన తినుబండపు అంగళ్లు కొన్నిగలవు. ఒక చల్లనినీటిభావి గలదు. మోటారింజన్ వేడితగ్గించుటకు నిచ్చట నీళ్లు పోయుదురు. ప్రయాణికులు సేదదీర్చుకొనుటకు అనువైన ప్రదేశము. ఇచ్చటనుండి దట్టమైన దేవదారు అడవిలో కొండలను చుట్టుకొనుచు వంకర టింకరగా విశేషమెక్కుడుగల దారిగుండా అనేక కొండసరులు, విశాలభూభాగములు, జలాశయములు నేత్రోత్సవముగా చూచుచు కొండలోనుండి పొడుచుకొని పైటికి వచ్చుచుండు నిర్మలోదకముగల చ్యారాపానీ చేరునప్పటికి మిక్కిలి చల్లదనముగలిగి శ్రమనివారణమై దేవదారువృక్షముల అరణ్యము మరిమరి దట్టమగుచు ఆనందమునుగొల్పు కాశ్మీరప్రయాణసుఖము ప్రారంభమగుచు 9 మైళ్లు పోవునప్పటికి

## ఘోరాగల్లి

5000 అడుగుల యెత్తులో గలదు. విరామములేని వర్తకప్రదేశము. ఇచ్చట వాచ్ టవర్ కట్టబడియున్నది. ఇచ్చటనుండి కొంచెము ఎక్కుడుదారిని రెండుమైళ్లుపోగా



కాయకష్టములపై నాధారపడు కాశ్మీరవాసులు.



నిర్విచారులై ప్రకృతిరామణీయక ప్రదేశములందు వసించు
కాశ్మీర దేశపు గొఱ్ఱెలకాపరులు.



కుమారి దేవకి

నెల్లూరున కార్నివలు కమిటివారిచే నాట్యకళాకౌశలమునకు
బంగారుపతకమునుపొందిన ఏడేండ్ల బాలిక.

## సన్నీబ్యాంక్

6000 అడుగుల యెత్తులో గలదు. ఇచ్చటనుండి మూడు మైళ్లలో రోడ్డుప్రక్కన

## మర్రి

6500 అడుగుల యెత్తులో గలదు. సొగసైన నివాసస్థానము. మంచి రస్తాలు, బజార్లు, వసతిగృహములు, భోజనశాలలు, కాఫీహోటళ్లు, సినిమా మొదలగు సౌకర్యములు గలిగియుండును. వేసవివిశ్రాంతికి చాలామంది యిచ్చట నివసింతురు. మరి యిచ్చటి పిండిశిఖరముమీదనుండి చూచినచో రావల్పిండివరకు గల 40 మైళ్లదూరము బహుశోభాయమానముగా గోచరమగుచుండును. ఇచ్చటనుండి రెండుమైళ్లుపోగా

## ఛ్ఛికాగలి

6500 యెత్తులోనుండును. ఈ ప్రయాణములో ఇదియె కడపటి యెత్తుప్రదేశము. ఇచ్చటి వ్యాపారస్తులకు విశ్రాంతియేయుండదు. వర్తకులచే క్రిక్కిరిసిన బజారు సుందరముగానుండును. ఇచ్చటనుండి దేవదారువనములగుండా కొండదిగుడు దారి ప్రారంభించి అయిదుమైళ్లలో

## బాగ్లా

5500 అడుగుల యెత్తులోగలదు. ఇది చిన్నపల్లె, ముచ్చటైన బజారును ధర్మశాలయుగలవు. వంకరదారిగా కొండదిగుచు కొద్దిగా వేడి ప్రారంభమై యేడుమైళ్లలో 3000 అడుగుల యెత్తునగల

## ఫాగ్వారి

చేరెదము. వంకరటింకరగా దిగుడుదారి చాలదూరమై విసుగుగలిగించు ప్రయాణమై పదునాల్గుమైళ్లు వచ్చిన తరువాత

## కోహాలా

చేరెదము. 1900 అడుగుల యెత్తులోనుండును. చిన్న గ్రామము. గొప్ప డాక్ బంగళాగలదు. చాలా వేడిగానుండును. ఇచ్చట సుంకపు చావడిగలదు. ఇచ్చటనుండి నదికిఎడమవైపువ రోడ్డుమీద ప్రయాణముసాగించవలెను. కాశ్మీరరాజ్య సరిహద్దు ఇచ్చటనుండి ప్రారంభమవును. చిక్కటిచక్కదారిని అకస్మాత్తుగా కొంతయెక్కుడుగలిగి కొన్నిమైళ్లలోనుండి దృశ్యము ఆమోదముసుగలించు విశాలమైన సంపూర్ణ జలముతో ప్రవాహములుగలిగి కొంచెము ఎక్కుడు దారిని పదకొండుమైళ్లదూరముపోగా 2000 అడుగల యెత్తులోనున్న

## డోలాయ్

చేరెదము. ఇచ్చట డాక్ బంగళాగలదు. ఎత్తైన పర్వతశిఖరములు ఒకటివెనుకనొకటి వరుసలుదీరి నేత్రపర్వ మొనర్చుచుండును. ముచ్చటైన మూడు సొరంగములలోదూరి రస్తాపోవుచుండగా పదిమైళ్లలో

## డోమెల్

2200 అడుగుల యెత్తులోనుండును. ఇది జీలం నదియు, కృష్ణగంగా నదియు కలియు ప్రదేశము. జీలం నదిపై కట్టబడిన వంతెన దాటి ముజాఫర్ మీదుగా అబ్బోటాబాద్ కుపోవు మార్గము గలదు. (వర్షాకాలమున సిరాయికళ లేక హవేలియన్ (యన్. డబ్ల్యు. ఆర్) రైల్వేస్టేషన్లకు శ్రీనగర్ నుండి పోవుమార్గము చీలుచోట 58 మైళ్లు. ఇచ్చటనుండి రైలుస్టేషన్లకు గలదు.) డోమెల్ లో చిన్న ముచ్చటైన డాక్ బంగళాయు, వైద్యశాలయు గలవు. ఇచ్చట క్రొత్త వస్తువులపై సుంకము వసూలు చేయుదురు. ఇకను దారి పచ్చని శృంగారములో పైనమై 14 మైళ్లు సాగి 2700 అడుగుల యెత్తుననున్న

## గార్రి

చేరును. రెండు ఫర్లాంగుల దూరములోనుండగా జీలంనదిపైన కట్టబడిన వంతెన దాటినదారి నదీతీరమును వదలి యిరుకైన కనుమలమధ్య పైనుండి నీరధారలు కప్పించుచుండ పచ్చనిచెట్లచే అలంకరింపబడిన కొండలచుట్టు వంకరలుగా దిరుగుచు దారి మిక్కిలి హృద్యముగానుండును. (సశేషము)

# అతడు రెండు రెట్లు ఎక్కువ సొగసుగా కనుపించుచున్నాడు



ఇపుడు అతని జుట్టు

బాగుగా దువ్వబడినది

డైమండు బ్రిలియంటైను

నీ మెదడును, జుట్టును చాలా పొడిగా నున్నయెడల "టాంకో" డైమండు బ్రిలియంటైను ఉపయోగించుము. దాని వలన తలవెంట్రుకలకు మంచి నిగనిగ కలిగి జిగురులేకుండ చేయును. ట్యూబులలోను మంచి డబ్బీలలోను ఉంచబడును.




తాతా




టామ్కో సేల్సు డిపార్టుమెంటు,
19-A, వాజియర్ వీధి, మదరాసు.

ఇతర టాంకో తలనూనెలలో జై హేర్ఆయిల్, లోషను, బ్రిలియంటైను, పెరుఫ్యూమ్డు హేర్టానిక్కు, గ్లిసరిన్ మొదలైనవి ఉండును.

## ది తాతా ఆయిల్ మిల్సు కంపెని లిమిటెడ్,

బొంబాయి.

# తండ్రియా? తనయుడా?

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

"ఏమండీ! అవధాన్లుగారూ!"

"ఏమిటండీ! శాస్త్రుల్లుగారూ!"

"మీ మనవడి మాటండీ. యిందాక తెల్లారగట్ల మన సుబ్బావధాన్లుగారు స్నానం చేసి వస్తూంటే వొకమాల గుంట ఎదురు పడిందట. దాంతో ఆయనకి కోపంవచ్చి దానిమీదరాయొకటి విసిరారట. ఆముండ వేషమే వేసిందో, నిజంగానో, నేలబడి తెలివి తప్పిపోయిందట. మీ వీధిగుమ్మంలోనుం చోని చూస్తూన్న మీ రామం ఆపాళంగా యింట్లోనుండి చెంబులో నీళ్లుతెచ్చి దాని మొహమ్మీద చల్లి తెలివివచ్చాక రెక్క పట్టుకు తీసుకెళ్లి దానింటిదాకా దిగబెట్టి వచ్చాట్ట. సుబ్బావధాన్లుగా రిదంతాచూచి దంగైపోయి అట్టే నిలుచుండిపోయారట. యీమాట నా చెవినిపడిందే నాకు కోపం ఆగలేక పెద్దవారు మీతో చెప్తే మంచిదని ఆపాళంగా పరుగెత్తుకొచ్చా. అవధాన్లు గారూ! ఆ మాలముండ అలాపడిపోతే శుద్ధశ్రోత్రియులం మనం ముట్టమనివుందీ. ఆఖరు కది చస్తేమాత్రం మన కేందుకండీ? అంటరానివాళ్లని మనం కళ్లతోనైనా చూడొచ్చా!"

"ఆ! ఆ! ఎంతపని చేశాడండీ! అబ్బ! యీకాలం వెధవలు మనమాట వినరండీ! అయ్యో! అయ్యో! నాపేరు చెరప పుట్టాడం డీతడు."

"చిన్న వాడు తెలియకచేసినట్టుంది. మీరు మందలించండి. యికమీదనైనా యిల్లాంటి పనులు చెయ్యకుండావుంటాడు. శెలవు."

౨

"ఒరే! రామం! తెల్లారగట్ల మాలగుంటని ముట్టుకున్నావట. నిజమేన్రా?"

"అవునండీ తాతగారూ! పాపం సుబ్బావధాన్లుగారు కొట్టినదెబ్బ కది మూర్ఛపోయింది. అదిచూచి నాకు జాలివేసి ముఖముమీద నీళ్లుచల్లి తెలివివచ్చిన తరువాత యింటిదాకా దిగబెట్టివచ్చాను. మీరు కోపం చేస్తారేమోనని వెంటనే స్నానంచేసే వచ్చానండీ!"

"ఓరీ వెధవా! ఎంతపని చేశావురా! మాలకుంకని ముట్టుకోమనివుందీ? అది మూర్ఛవచ్చి పడితేనేం? ఆయుస్సు లేక చస్తేనేం? బ్రాహ్మణవెధవ్వి నువ్వు ముట్టుకుంటావా!"

"తాతగారూ! మనవంటి మానవజన్మమెత్తిందే మన కళ్లెదుట బాధపడుతూవుంటే చూచి వూరుకోమంటారా! పరులకి సాయం చెయ్యడమే పరమధర్మం కదండీ!"

"ఓహో! గుడ్డొచ్చి పిల్లనెక్కిరించిందట. నాకు నీతులు బోధిస్తున్నావు. ఆ యింగిలీసు నేర్చుకున్నవాళ్లకి మంచిబుద్ధు

తెలావుంటాయి? యిదిగో చెప్తున్నా విను. యికమీద యిలాటి వేషాలు నాదగ్గర పనికిరావు. వెళ్లు మళ్లా స్నానంచేసిరా. పరోపకారమంట. నీమొఖం. నా బ్రాహ్మణ్యం మంటగలపడానికి పుట్టావు."

3

"ఏమండోయ్! అవధాన్లుగారూ! శుద్ధ శ్రోత్రియులై యుండి యిల్లా పూరుకుంటు న్నారేమండీ?"

"ఏమిటండీ శాస్త్రుల్లుగారూ! మళ్లీ మా రామంగారి మీాదేనా? అబ్బబ్బ! రోజూ వీరి గొడవలు ఆలకించలేక ఆ వెధవని చీవాట్లు పెట్టలేక చచ్చిపోతున్నానండీ. యేవయిందేవిటి?"

"యింకే వుందండి! వాణ్ని మీారు వదలి పెట్టేనావుండాలి. లేకుంటే మీారైనా కుటుంబంతో కులంలోనుండి వేరుపడాలి."

"ఆ! ఆ! అంతపనీ! యేం జరిగిందండీ? యీావెధవ శనిగ్రహం మళ్లీ నా కెక్కడ దాపురించాడండీ?"

"పూళ్లో అంతా కలరాగావుందని తెలుసునా! మాలగూడెంలోకూడా కలరా హెచ్చుగావుందట. మీా అబ్బాయి ఆ గూడెంలోదూరి, ఆ మాలవెధవలకందరికీ చాకిరీచేస్తునాట్టండీ! యిప్పుడైనా మీారు కళ్లుతెరిచి వాణ్ణి వదలిపెట్టడమో, మరే కులంలోంచి వేరుపడ్డమో ఆలోచించుకోండి. బ్రాహ్మణసంఘం యింకిలాంటి పనికి వోర్చదు. ఏదో తెగదెంపులు చెయ్యండి. యేదో యీా అగ్రహారానికి మీారే పెద్దలు గదా అని యింతకాలం వోర్చింది సంఘం. ఇకమీాద వోర్చదు. పోయివస్తా. శెలవు."

4

"కొంప మునిగింది. రాజూ! యిదిగో! చూడు. యింకమీాద ఆ వెధవమొహం చూడను. వాడింట్లో కాలుపెట్టడితే నా యింట్లో యింక వుండడానికి వీల్లేదని చెప్పేశెయ్యి."

"ఏంచేశాడు నాన్నా!"

"ఏంచేశాడా! కడుపు చెడపుట్టినందుకు వంశాన్ని వుద్ధరించాడు. యింక వాడికీ నాకూ సమ్మంధంలేదు. పొమ్మను వాణ్ణి. వాడు నా మనవడు కాదనుకుంటా లేక పోతే చచ్చాడనుకుంటా అంతే."

"అసలు జరిగిందేంటో చెప్పు నాన్నా!"

"జరిగిందేంటా? యేవీలేదు వాడి శ్రాద్ధం. శుద్ధమైన బ్రాహ్మణవంశంలో పుట్టి మాలముండల్ని ముట్టుకుంటాడూ? మొన్న వొక మాలగుంట క్రిందపడితే యీావెధవ వెళ్లి దానిమీాద నీళ్లుజల్లి దాన్ని పట్టుకో నింటిదాకా దిగబెట్టివచ్చాట్ట. నిన్నొకమూల కుంక చెర్లోపడితే యీాగాడిద చెర్లోదిగి వాణ్ణి తీశాట్ట. ఇప్పుడు వూళ్లో కలరా గుందా? మాలగూడెంలోదూరి యీావెధవ ఆ మాలవెధవలికి చాకిరీచేస్తున్నాట్ట. చూశావా? పీడి పన్లు. ఇల్లాంటివి చెయ్యొద్దని మొన్నిసార్లు నేను కొప్పడ్డా వినలేదు కదా! తిరిగీ నాకే నీతులు చెప్పబోతాడు.

నిన్నగాక మొన్న బుట్టిన వెధవ కింత గర్వమా? చిన్నతనంలోనే తలచెడ్డావు కదా అని నిన్నూ నీ కొడుకునీ తెచ్చి దగ్గరపెట్టుకొని యింత వాణ్ణి చేసినందుకు ఆఖరికీ వెధవ నాకు తెచ్చిపెట్టిన పేరిదా! ఇంతకీ ఆ యింగిలీసు చదువే కొంప ముంచింది. అప్పుడే కులంపోయే చదువది, యిది వొద్దు, వేదం చదివించనే అంటే వినకుండా నీ నగలన్నీ అమ్మి చెప్పించావీ మాయచదువు. చదివించినందుకు తగిన శాస్తిచేశాడులే. పెద్దవాణ్ణి నామాట విననందుకు అనుభవించు. ఇక వాడు నాయింట్లో వుంటానికి వీల్లేదు. ఇందాక శాస్త్రుల్లుగారు వచ్చి నామీద మొగిరివెళ్లాడు. వీణ్ణి వెళ్లగొట్టకపోతే నన్నుకూడా కులంలోంచి తీసేస్తారట. చూశావా! నీ కొడుకు చేసిన వుద్ధరింపు. ఇక వాడు నాకవసరంలేదు. పొమ్మను. యిష్టంవుంటే నువ్వుకూడా ఆ వెధవతో కలిసిపో! మీ అమ్మతోపాటు నువ్వుకూడా చచ్చావనుకుంటా. లేదా! వాడిమాట తలపెట్టక నాదగ్గర పడుండు. వాడు లేడనుకో కులంకంటే కొడుకెచ్చా? ముందు వాణ్ణి పొమ్మను. వాడి మొహంచూడ్డం నాకిష్టం లేదు. లేకుంటే నేనే చెప్పుందును."

"బాబూ! యింతసేపూ యేంచేస్తున్నావు?"

"మాలగూడెంలోనుంచి స్నానంచేసి యిప్పుడే వచ్చానమ్మా!"

"అదేమిట్రా! మాలగూడెంలో కెందుకురా?"

"అమ్మా! కలరా వూరిలో చాలా తీవ్రంగావుంది. అందులో మాలగూడెంలో స్థితి తెల్పలేనమ్మా! పాపం వాళ్లకి చూచే వాళ్లు లేరు. మందు లిచ్చేవాళ్లులేరు. వైద్యశాలలో కూడా వాళ్లకి ప్రవేశం లేదమ్మా! పాపం దినానికి ముగ్గురు నలుగురు చచ్చిపోతున్నారు మాలగూడెంలో. వాళ్లకి మందులిచ్చి సేవచెయ్యడానికి "హరిజనసేవాసంఘం" అని ఒక సంఘం స్థాపితమయింది. అందులో నావంటి యువకులంతాచేరి మాలవాళ్లకు సాయం చేస్తూంటే డాక్టరుపరీక్ష చదివిన నేను చూస్తూ వూరుకుండేదెట్లమ్మా?"

"అదికాదు నాయనా! మీతాతగారి మనస్సుబట్టి మనం నడుచుకోవాలికదూ? నీచిన్నతనంలోనే మీనాన్నగారుకోరి తెచ్చి ప్రేమతోపెంచి పెద్దచేశారుకదా! అల్లాంటి తాతగారిని ధిక్కరించి తిరగడం నీకు మంచిది కాదని చెప్తున్నా."

"అయ్యో! అమ్మా! నీవుకూడా యిట్లా అంటావేమిటమ్మా? నిజమే తాతగారి ఋణం ఈ జన్మలో తీర్చుకోలేనుగాని అమ్మా! ఒకసారి ఈదేశమాతవైపుచూడు. తనబిడ్డలే ఒకరిలోఒకరు జాతిభేదంపెట్టుకొని ఆపదకాలంలో ఒకరికొకరు సహాయపడక తోడిమానవుల్ని కష్టపెడుతుంటే, తనబిడ్డల దుఃఖస్థితిచూడలేక కారుస్తూన్న కన్నీరు

చూడమ్మా! భారతమాత సుపుత్రుడు గాంధీమహాత్ము డీ హరిజనుల నాదరించుమని చేయు బోధనలువింటూ చీము నెత్తురుగల యేభారతీయుడు హరిజనులకష్టములను చూస్తూ సహింపగలడమ్మా! ఈ గాంధీ యుగంలో హరిజనులగురించి ప్రబోధింపబడుచున్న యీదినములలో మనకండ్లయెదుట మనసోదరులు కష్టపడుతూంటే చూచి పూరుకుండేదెట్లమ్మా! తాతగారింత ముసలివారైనా, యింతఅనుభవజ్ఞులైనా, యీవిషయంలో మూఢత్వం చూపించడం నేను సహించలేనమ్మా!"

"తండ్రీ! నీమాటలన్నీ నిజమే. కాని బాబూ! నాకు కష్టంగావున్నా చెప్పక వీలు లేదు. తాతగారు, యీరోజునుండి నిన్నింట్లో వుండద్దన్నారు. బాబూ! రామం! మీ నాన్నగారు లేకపోయినా, నిన్నుచూచి నా దుఃఖాన్ని మ్రింగాను, యిప్పుడు నిన్నేవదులుకో వలసివచ్చింది. ఇదిగో నాదగ్గరున్న సొమ్ము. ఏ ధర్మంకోసం నువ్వు తల్లిని విడవ్వలిసివచ్చిందో, ఆ ధర్మదేవతే నిన్ను కాపాడుతుంది. నాయనా యింక వెళ్లు. దైవాన్ని నమ్ముకో. న్యాయాన్ని వదలి పెట్టక."

"అమ్మా! తాతగారి యిష్టప్రకారం యిదిగో యిప్పుడీ యిల్లువదలిపెడ్తా. నీవు మాత్రం తాతగారిని కనిపెట్టుకొనివుండు. వృద్ధులయియున్న తాతగార్ని నీ వీ సమయంలో వదలిపెట్టడం మంచిదికాదు. అమ్మా! అమ్మా! యేడవకు. అబ్బ! నీవు యేడుస్తూంటే, వెళ్లడానికి నాకు కాళ్లురావడంలేదమ్మా! అమ్మా! చూడు. హరిజనసేవకోసం నీపుత్రుణ్ణి అర్పిస్తున్నానని సంతోషపడక ఇట్లా విచారపడతావేమమ్మా! యీ శుభసమయంలో నీ పుత్రుణ్ణి ఆశీర్వదించి పంపు, నీశుభాశీర్వాదమే నన్నెప్పుడూ కాపాడుతుంది."

౬

"నాన్నా! నాన్నా! నేను. నీరాజుని. మాట్లాడవేం నాన్నా! ఒక్కసారి కళ్లెత్తి చూడు. అయ్యో! నాకేందారి? నాన్నా! చెప్పు యిప్పుడైనా నీ మనుమడ్ని ఒక్కసారి పిలిపించమంటావా?"

"ఛీ...వ...ద్దు...ఆ...వె...ధ...వ మొ...ఖం...చూ..డ...ను."

"యేమండీ శాస్త్రులుగారూ! అవధాన్లగారి కెలాగుందండీ?"

"ఓహో! చయనులుగారా? దయచేయండి. అవధాన్లుగారికా? పాపం. కలరా తగిలినమనిషి బ్రదకడం కష్టంగదండీ? అందులో వృద్ధులు. యిప్పుడో, యింకో గడియకో అన్నట్టుంది."

"అమ్మా! రా..జూ..."

"ఏంనాన్నా! ఇదిగో యిక్కడేవున్నా."

"ఒక్క...ఒట్టు...వేస్తావా?...నేను...చెప్పి..నట్లు...చేస్తావా?"

"వేస్తానాన్నా! యేమికావాలె? యిదిగో నాకొడుకుమీదుగా చెప్తున్నా. నీవు చెప్పినట్లు నా ప్రాణా లిచ్చైనా వేస్తా."

"అమ్మా...ప్రాణంపోతుంది....నే...చచ్చింతర్వాత....శ్రీరామాన్ని....పిలవక...యిన్....అబ్బా....బ్రాహ్మణులచేతే...నాకు...కర్మ...జరిపించు...నా...వంశ....గౌరవాన్ని....కాపాడి...నీతండ్రి....రుణం....తీర్చు...చెప్పు....అలా...చేస్తావా ?"

"అలాగేనాన్నా! అయ్యో! యిప్పుడైనా నీపంతంతీరలేదా ?"

"అ...బ్బ....అదిగో.....మళ్లీ....ఆ మాట...యెత్తొద్దు...చెప్పు...నేచెప్పినట్లు...చేస్తావా?"

"చేస్తానాన్నా!"

"నా...రా...య...ణ...నా...రా_'

"దింపండి. దింపండి ప్రాణాలుపోతున్నాయి."

"నాన్నా! నాన్నా! నన్ను వదలిపోతున్నావా! నాకు దిక్కెవరునాన్నా!"

"అమ్మగారూ అమ్మగారూ!"

"యెవ్వరావాడు?"

"నేను మాలగోపినండి"

"ఛీ! దూరంగా పో వెధవా! నీకిక్కడ పనేవిట్రా?"

"లేదు బాబుగారూ! ఆ రాజమ్మగోరి కొడుకు రామంబాబుగోరికండి కలరాతగి."

"ఆ! ఆ! నా రామనికీ? నాతండ్రికీ? యెక్కడున్నాడు ?"

"అమ్మా! యిందాకే ప్రాణాలుపోయాయండి."

"హా! రామం! బాబూ! బాబూ! అయ్యో! యింకెక్కడరామం? యేడీ నా బాబు? పదచూస్తాను."

"ఆ! ఆ! రాజమ్మా! యిదిగో చూడు ఆరామాన్ని చూడ్డానికి వెళ్లావంటె యీ అవధాన్లుగారిని యిట్టే వదలిపెట్టి చక్కాపోతాం. ఆఖరికి మీనాన్న నీచేత యేవని ప్రమాణంచేయించాడో జ్ఞాపకంవుందా ? చూస్కో ?"

"అమ్మగారూ! పాపం బాబుగోరు ఆఖరిదాకా అమ్మా! అమ్మా! అని పిలుస్తూనే వుండారండీ. పానాలుపోయేముందు అమ్మనాకు ముద్దుపెట్టుకున్నాక కాల్చమని చెప్పారండీ. రోగం అవుపడ్డగంటకే పానాలు పోయాయండి."

"వెళ్లురా వెధవా! రాజమ్మా! యెల్లాగు కులంపోయిన వాడి జోక్యం నీకెందుకూ, మీనాన్న సంగతి చూడు."

"ఒక్కసారి మాబాబునుచూస్తా. తండ్రీ రక్షించు రక్షించు."

"వీల్లేదు. అల్లా వెళ్లావంటే మేమంతా యిప్పుడే లేచిపోతాం, రండోయి. చయనులూ."

పాపం తండ్రియా! తనయుడా ?

మనజీవితములో మన అదృష్టమెలావుంటుందో ఎఱుగము. నాజన్మకాలములో నాభావి అదృష్టాన్ని తెలిపే శుభసూచనలేవో కనిపించాయట. అవేమిటో నాకు తెలియవు కాని నాతలిదండ్రులకు తనయుడుగా జన్మించడమే నాకొక గొప్పఅదృష్టము. నా తలిదండ్రులు వారి పవిత్రజీవితమునే ఆదర్శముగాచూపి నాలో కొన్నిఆశయాలను గాఢముగా నాటివున్నారు. అవెప్పటికిని నశింపవు. వాటి ప్రాబల్యము నా జీవితానికి చుక్కాణి. వానికి దూరంగా నేనెపుడూ వుండను.

# ఆదర్శ

రాబర్టు టెయిలరు నేటి సినీమాప్రపంచమున ప్రపంచవాసులందఱిచే నమితముగ ప్రేమింపబడుచున్న ప్రతిభాశాలియగు నటకుడు; యువకుడు; సౌందర్యమూర్తి. పాశ్చాత్యులందు టెయిలరు పేరువిన్న చకితలుగాని స్త్రీలుగాని, సినీమాయందాతని నటనాకౌశలమును గాంచి పరవశత్వమునొంది యతని యమితముగ ప్రస్తుతింపని నారీమణులుగాని లేరు. ప్రపంచములో ప్రదీప్తతార

ఉన్నతాదర్శాలతో పుడుకుతూవుండే యువకరక్తము తగినవుపాధిలేక క్రుంగిపోయి వున్నపుడు అకస్మాత్తుగా అదృష్టము ఆవహించినదంటే అది ఆశాభంగముకంటె అమితముగా ఆశ్చర్యము కలిగిస్తుంది.

నాకీలాంటిదే 1934-వ సం. లో తటస్థమైంది. తరువాత మూడేళ్ళకు 1937 లో ఇతరులకు కలిగిన ఆశ్చర్యమునకంటె ఇది నాకే అమిత ఆశ్చర్యమును గొలిపింది. 1934 వ సం. ఫిబ్రవరి 6 వ తేదీన మెట్రో గోల్డ్విన్ మేయరు స్టుడియోవారు నన్ను వారి చిత్రాలలో నటించుటకు కంట్రాక్టు చేసుకొమ్మని పిల్చారు.

ఆదినము నేను పోయిగా లేననుట సాహసము కాని నటకునిజీవితాలనుగూర్చి యెటువంటి ఆవకతవక వార్తలు వ్యాపింపజేస్తూవుండేవారో, ఆనాడు నే తెలుగనిదికాదు. మొదట నేను స్క్రీన్ టెస్టులో నెగ్గానని వినడము నాకు మేఘాలలో సంచరించినట్టు కనపడింది.

యథార్థమైనపరీక్ష అపుడుమాత్రమే ప్రారంభించినదని నేనిపుడే తెలుసుకున్నాను.

సుప్రసిద్ధ తారాగణముతో కూడి నటించుటకు అనుమతి పొందితేనేగాని అసలు స్క్రీన్ టెస్టు ప్రారంభముకాదని నాఆశయము. ఇది నాస్వంత అభిప్రాయమేగాదు. నేనిది స్వానుభవముచే తెలిసికొనుటకుముందే క్లార్కుగేబిల్ లాంటి సుప్రసిద్ధ నటకులంతా ఆలాగే అభిప్రాయపడేవారు.

హాలివుడ్డులో వున్న ప్రసిద్ధతారాగణముతో అదురూబెదురు, నరాలస్వాతంత్ర్యముతప్పి బాధపడడము లేకుండా ఏమాత్రము అనుభవములేని ఒక యువకుడు ఒకచిత్రములోనైనా నటింపలేడు. పరస్పర సంబంధము కనపడని విచిత్రమైన చిత్తసంక్షోభాలు, స్వశక్తి నిరుపయోగమౌతుందేమో అనే అనుమానాలు విజయుణ్ణి కాలేననే భయము కలుగకుండా గ్రేటాగార్బో, జోన్ క్రాఫోర్డు, జీన్ హార్లో ఎలీనార్ పావెల్ వంటి తారలతో ప్రముఖపాత్రల నిర్వహించడానికి ఎవనికన్నిగుండెలు?

ఈరంగములో నటకునికి స్వశక్తిపై నమ్మకముండుట వుత్తమగుణమే కాని అసలుసామర్థ్యమే మూలకందము. నాఅనుభవమేమిటంటే నేను చిత్రాలలో రాణింపగలనంటూ ప్రారంభించాను గాని రాణింపవలెనంటూ వానిలో పాల్గొనలేదు. ఎంత సామర్థ్యమున్నా అదృష్టములేకుంటే ఎవరును పైకి రాలేరు. ఇది నావిషయములో నూటికి నూరుపాళ్లు సత్యము.

# ప్రాయులు

లని పేరొందిన గ్రేటాగార్బో, బార్బరాస్టాన్‌విక్, జీన్‌హార్లో, జోన్‌క్రాఫోర్డు మొదలగు నటీమణులందఱాతనితో నటించి జగద్విఖ్యాతిఁగడించిరి. స్త్రీలోకముచే నింతటి పొగడ్తకెక్కిన యీయువకుని హృదయములో ప్రేమనుగూర్చి స్త్రీత్వమునుగూర్చిన యభిప్రాయములెట్టివి? అతఁడిటీవల ప్రకటించిన ఈక్రిందికథ వానికినిధి. ఇందలివిషయము లసదృశములు, దివ్యాదర్శములు.

> చిత్రాలలో నటించే ప్రతివారని 'నీవెలాంటి వారినైతే పెళ్లాడుతావు' అని పలుమారు ఎంతోమంది అడుగుతూ వుంటారు. దానికి నేనెపుడూ చెప్పేమాట వొకటే. వివాహ విషయములో నాకు నా తలిదండ్రుల జీవితమే ఆదర్శప్రాయము. వారాదర్శులగు భార్యాభర్తలు. వారిది అనన్యసామాన్య దివ్యప్రేమమయ జీవితము. నాకంతకంటె వుత్తమమైన వైవాహిక జీవితము అనవసరము కాని దానికంటె ఏకొంచము తక్కువైనా నేనాజీవితాన్ని ఎంతమాత్రము అంగీకరించను.

మాతండ్రి రూత్‌స్టాన్‌హోప్‌ను పెళ్లిచేసుకున్నారు. ఆమెకపుడు పద్ధనిమిదేళ్లు; మాతండ్రి ఆమెకంటె చాలాఏళ్లు పెద్దవారు. వారిద్దరు ఫిల్లీలో ఒకరినొకరు బాల్యమునుండి చక్కగా ఎఱిగినవారే.

మాతండ్రిపేరు స్పాంగ్లర్ బ్రూ. వారిది పెన్సిల్వేనియా డచ్ అనబడు కర్షకవంశము. వారి తండ్రి తాతలందరు ఆపేరివారే. నాకుకూడ ఆపేరే రావలసింది. కాని నాకు రాబర్టు టెయిలర్ అని వేరుపేరు వచ్చింది.

మా మాతామహుడు ధాన్యపు వ్యాపారి. వివాహము అయినతరువాత అల్లుని తన వ్యాపారములో చేర్చుకున్నాడు. ఫిల్లి గ్రామము గోధుమపంటకు కేంద్రము. అందుచేత వారిద్దరి వ్యాపారము అభివృద్ధి పొందినది.

మా తలిదండ్రులు ఆనందములో మునిగి తేలుతూ వుండేవారు. వారు బాల్యమునుండి ఒకేచోట పెరిగి, పరస్పరము ప్రేమించి తరువాత ప్రేమతో పెరుగుతూ వచ్చారు.

మాతల్లి అసలే బలహీనురాలు. ఆమె స్థితి రాను రాను కృశించింది. మాతండ్రిఎంతో ఆవేదనపడినారు. ఎందరెందరు వైద్యులనో పిలిపించారు. వారు ఆమె హృదయము క్రమక్రమముగా బలహీనమైపోతూ వుందని చెప్పినారు. ఆయన కది భరింపరానిదైంది. తనఅసహాయతకు తానెంతో బాధపడినారు.

తుదకు వారికి ఒక ఆలోచన పొడచూపింది. ఆలా చేస్తేనేగాని మాతల్లికి జీవితాశవుండదు. కాబట్టి ఏమైనాసరే ఆ పనిచేయ నిర్ణయించుకున్నారు. అదేమిటంటే అపుడే ప్రారంభించి వైద్యవిద్య చదవడము, తన జీవితమంతా ఆమె ఆరోగ్యము బాగుచేయడానికి ప్రయత్నించడము.

ఈనిర్ణయానికి వచ్చినపుడు మాతండ్రికి ముప్పదేండ్లు. వారు చిన్నపుడింతో అంతో చదువుకున్నారుగాని ఉన్నతవిద్య ఏమీలేదు. అప్పటినుంచి తన కాలమంతా ధాన్యపు వ్యాపారములోనే కడిపినారు. అట్టివారు వైద్యవిద్యచదివి డాక్టరు కావాలంటే అది అసాధారణమే.

తన ఆశయమేమిటో భార్యతో చెప్పినారు. వైద్య కళాశాలవున్న ఏవూరులోనైనా కాపురము పెట్టాలని వారి వుద్దేశము. మాతల్లి తోడనే తన అంగీకారము చూపెట్టింది. అంటే తనకోసరమని కాదు; తాను తలంచుకున్నప్రకారము నెరవేర్చకపోతే మాతండ్రి బాధపడతాడని ఆమెకు తెలుసును. అది ఆమె కెంత మాత్రమూ యిష్టములేదు. వారు కార్యము సాధించి

విజయము గాంచవలెనంటే ఆమె వెంటనేవుండి తనకు చేతనైనంత తోడ్పడవలెను. దానికై వారివెంటనేవుండి వారితోకూడానే వైద్యకళాశాలలో తానూచేరి వారి చదువు కుత్సాహము కలిగించాలని తీర్మానించింది. ఆమెకు భర్తయెడలవున్న అపారమైనప్రేమా, భక్తి అందులో అద్భుతముగా ప్రతిఫలించాయి.

తరువాత మాతల్లీతండ్రీ యిద్దరు మిసోరీ రాష్ట్రములోని కిర్క్సువిల్లీపట్టణములో మెడికల్ కాలేజీలో చేరినారు. బలహీనముచే పాలిపోయిన ఆయువతిని ప్రక్కనేవుంచుకొని, ముప్పదేళ్ల విద్యార్థి చూపెట్టిన అనిర్ణయమూ ఓర్పూ తలచుకుంటే నాకు శరీరము వుప్పొంగుతుంది. తనతోడి విద్యార్థులు, ఉపాధ్యాయులుకూడా యీ దంపతులనుచూచి ఎంత ఆశ్చర్యపడినారో? కళాశాల విద్యకుతగని ఆ వయస్సులో అంతపట్టుదలతో అంతకష్టమైన చదువు ఎందుకు ప్రారంభించినాడని ఎంతగా గుసగుసలాడుకున్నారో? కాని ఆదంపతులిద్దరూ ఒకరినొకరు ఒకనిముషమైనా విడిచివుండలేరని ఒక మాపుతోనే తెలిసికొనివుంటారు.

వారిద్దరు కాలేజిలో ఒకసంవత్సరము చదివారు. ఇంతలో స్వగ్రామమునుండి మాతండ్రిగారక్కడికి వెంటనేవెళ్లవలెనని వుత్తరంవచ్చింది. వెళ్లకపోతే వ్యాపారమంతా చెడిపోతుంది. అయినా వారు వెళ్లనని పట్టుపట్టినారు. మాతల్లిఎంతో బ్రతిమాలి వూరికి వెళ్లేటట్టుచేసింది.

వారిద్దరు ఫిల్లీ చేరుకున్నారు. మాతామహుడు వ్యాపారము కొనసాగించుకుండే స్థితిలోలేడు. అందుచేత తండ్రి వెంటనే వ్యాపారములోప్రవేశించినారు.

వారాలు గడిచాయి. ప్రతిదినము మాతండ్రి ఒకవిధమైన భయముతో మాతల్లి వంకచూస్తూవుండేవారు. అపుడంతా మాతల్లి 'నాకేమీ ఫరవాలేదు. నేనారోగ్యముగా వుండడము మీరు చూస్తూన్నారుగదూ? మీ వ్యాపారము మీరు చూచుకొనండి; నావిషయమై బెంగపెట్టుకొనవద్దు'అని చిరునవ్వుతొలుకాడ జబాబు చెప్పేది. అంతేకాకుండా ఆమెకొంచము ఆరోగ్యముగా కనపడుతూ చురుకుగా తిరుగుతూవున్నందున మాతండ్రి ఆమె అభివృద్ధిపొందుతూ వుందనే అనుకున్నారు. వారు స్వగ్రామము వీడలేదు. ఒకటిన్నరసంవత్సరమైంది. ఆ ఆగస్టుమాసములో నేను జన్మించాను.

అంతవరకూ మాతల్లికివున్న ఆరోగ్యము నా జననముతో పూర్తిగా క్షీణించింది. శరీరములో రక్తముచుక్కలేక తెల్లబారి, మాటాడేందుకు శక్తిలేకుండా పరుపుకు అంటుకునిపోయింది. ఈ స్థితిలోనే ఆమె ఒకసంవత్సరముంది. మాతండ్రి స్థితి వర్ణనాతీతమైంది. వారొక దుఃఖదేవతలాగ తిరుగుతూ వుండేవారు. ఆమెను విడువనిష్టములేదు; దినములు మాత్రము రివ్వున పరువెడుతూ వున్నాయి.

ఆసంవత్సరాంతములో తల్లి కొంచము తేరుకుంది. ఆమెకు ప్రయాణము చేయగలిగినంతశక్తి రాగానే మాతండ్రి వ్యాపారాన్నికట్టిపెట్టి వైద్యవిద్యముగించడానికి కిర్క్సువిల్లీ చేరుకున్నారు. వారికిపుడు ముప్పయినాలుగేళ్లు. అంటే మొదట చదువ ప్రారంభించి మూడేళ్లయిందన్నమాట. అపుడు చదివినదంతా ఓపికతో పట్టుదలతో మరల చదువుటకు ప్రారంభించారు. తల్లికి మరల కాలేజిలో చేరడానికి తగినంత శక్తిలేదు. నన్ను పెంచడానికి ఎవరికైనా నియమింతామంటే ఆర్థికపరిస్థితి బాగులేదు. కాబట్టి తల్లి బలహీనముగావుండీ నన్ను పెంచే భారమంతా వహింపవలసి వచ్చింది. నేను మూడేళ్లకుఱ్ఱాణ్ణయినా మహాఅల్లరి చేసేవాడినట. అసలే బలహీనముగావున్న మాతల్లి నన్నుపట్టకొనలేక చాలాకష్టపడేదట. ఈలాంటి దినాల్లో మాతండ్రి నన్నుకాలేజీకి తీసుకుని వెళ్లేవారు. అక్కడ నన్ను వారెలాపట్టుకునేవారో, ఎవరికి పప్పచెప్పేవారో తెలియదు. నేను పెరిగేకొద్దీ నన్ను క్లాసురూములోనికి తీసుకునివెళ్లుటకు అనుమతిచ్చారు. నేను ముందు మాతల్లి కూర్చున్నట్లు తండ్రిప్రక్కనే

కూర్చునేవాణ్ణి. అక్కడ నేనెంతో బోధనచేత నెమ్మదిగా కూర్చోవడము, శ్రద్ధగా గమనిస్తూవుండడము నేర్చుకున్నాను.

ఒకసంవత్సరము జరిగింది. మా నివాసము పట్టణము వెలుపల ఒక కుటీరములోనికి మార్చారు మాతండ్రి. అప్పటికి తాను కృషిచేసినది రెండేళ్ళేఅయినా మా తండ్రి మాతల్లిగారిరోగమును ప్రత్యేకముగా చదువుటకు ప్రారంభించారు.

మా కుటీరము మంచి ప్రశాంతవాతావరణములో వుండేది. కావలసినంతగాలి ఎండావుండేవి. నూతన పరిసరాలకు మాతల్లి చాల యిష్టము చూపేది. ఆమె ఆరోగ్యముకూడా బాగుపడింది.

మా తండ్రి తుదకు వైద్యపట్టము పొందినారు. మాతండ్రికి వైద్యపట్టము లభించేదినము సమీపించే కొద్దీ మాతల్లి అనారోగ్యము దూరమౌతూవచ్చింది. వారేమిచేశారో తెలియదుగాని నిరంతరమూ చికిత్స చేస్తూ, ఉపచారముసలుపుతూ, సలహాలిస్తూ వుండేవారు. నేను ఐదేళ్లవాణ్ణైవున్నప్పుడే మాతండ్రి ఫ్రీమాంట్‌లో వైద్యము ప్రారంభించారు. తల్లికి పూర్తిగా ఆరోగ్యము కలుగకపోయినా ముందుకంటె వెయింతలు నయమైంది; పైగా దినదినాభివృద్ధి పొందుతూవుండేది. నేడు ఆమె మంచి ఆరోగ్యముతోవుంది. మాతండ్రి వైద్యపట్టముపొంది నేటికి యిరవైయేళ్లు.

మా తలిదండ్రులు తమ సమాచారాలను ఇతరులతో చెప్పుకునే అలవాటులేనివారు. అయినా మాతండ్రి ఫ్రీమాంటులో ప్రాక్టీసు మొదలుపెట్టిన అచిరకాలములోనే వారుమాతల్లికి నయముచేసిన జబ్బువిషయమై అందరికీ తెలిసిపోయింది. ఆవూరు పెద్దపట్టణము కానందువల్ల ఒకరి విషయాలు ఇతరు లింతత్వరగా తెలిసికొనడానికి అవకాశము కలిగింది. అప్పటినుండి ఆవూరువారేగాక చుట్టుప్రక్కలవారంతా తండ్రి దగ్గరకేవచ్చుటకు ప్రారంభించినారు. వైద్యశాస్త్రములో వారు గడించిన ప్రజ్ఞ నానాటికి అందరికి చాలా నమ్మకము గలిగించింది.

మేమెంతోకాలము ఫ్రీమాంటులో వుండలేదు. అక్కడనుండి బియాట్రీసుకు మాతండ్రి నివాసస్థానము మార్చారు. అంతవరకు మేమున్నవూళ్లలో ఆవూరే పెద్దది. నాకళ్లకది ఓపెద్దపట్టణములాగే కనపడింది. నేనిక్కడే స్కూల్లో ప్రవేశించింది. ఇప్పుడు నాలో వున్న పెక్కుగుణాలు ఆశయాలు ఇక్కడి జీవితములోనే హత్తుకుని పోయినవి.

అవి ఆనందముతోకూడిన సంవత్సరాలు. నిర్జీవ ప్రతిమలాగు అనారోగ్యముచేత పరుపుకు అంటుకుని పోయిన మాతల్లి ప్రతిమ స్మృతివీధుల్లో లేకుండా పోయింది. దాని స్థానే కలకలలాడుతూ ఆరోగ్యముతోవున్న అమ్మముఖము ప్రత్యక్షమైంది. భార్య అనారోగ్యము తనకు కలిగించిన నిరంతరఆవేదన, మానసికభాధతో ముఖము వాలవైచుకునివుండే మా తండ్రిగారుకూడా నిత్యానందముతో తయారయ్యాడు. అంతేగాకుండా నలుగురిలో మంచిపేరు, ఇష్టమైన వుద్యోగము కావలసినంత రాబడి వారికుండేది. ఇల్లు తృప్తికి నిలయమైంది. ఆవాతావరణములో పెరిగే అదృష్టంపట్టింది నాకు. అప్పటినుంచి మాగృహమంటే వారి జీవితాలంటే నాకాదర్శప్రాయాలై పోయినవి.

నేను స్కూలుముగించి కాలేజీలో చేరినాను. అప్పటినుండి సంగీతముకూడ నేర్చుకోడానికి ప్రారంభించితిని. మా సంగీతోపాధ్యాయునికి పొమోనా కాలేజికి బదిలీఅయింది. నాసంగీతాన్ని అభివృద్ధి చేసుకునే తలంపుతో, మాతాపితల అనుమతిపొంది, ఆవుపాధ్యాయునితోకూడా అక్కడికి చేరుకున్నాను.

అక్కడ కాలేజీవారొక నాటకమాడినారు. అందులో నన్నొక కాప్టెన్‌గా నటించమన్నారు. ఆ నాటకము ముగిసినది. ఆనాటకాన్ని ఆనాడుచూచిన

సభ్యులలో మెట్రోగోల్డ్విన్ మేయరు స్టుడియో వారెవరో వున్నారట. ఆమరుదినము ఆస్టుడియోనుండి నన్ను చిత్రాలలో నటించుటకు కంట్రాక్టుతీసుకొమ్మని వార్తవచ్చింది. ఆవార్తవిని నన్ను నేనే నమ్మలేకపోయాను.

వెంటనే ఇంటికి ఈ సంగతంతా వ్రాసినాను, ఏమిచేయమంటారని. ప్రత్యుత్తరముకూడా వెంటనే వచ్చింది. "నీవేమిచేసినా, ఏనిర్ణయానికివచ్చినా ముందు నీచదువు ముగించుకో. ఈ విషయములో నీతండ్రి నేను అభిప్రాయపడేదేమిటంటే అది నీవే నిర్ణయించుకోవలసిన సంగతని. అయితే, శ్రద్ధగా మాత్రము వుండు నాయనా! నిదానంగా ఆలోచించు" అని మాతల్లినుండి వచ్చిన జబాబు.

నిదానంగా ఆలోచించడమా? అంతపెద్ద కంపెనీ అట్టి అవకాశము కలిగిస్తుంటే? కాని ఆనందపారాన్ని చూచిన ఆదంపతులనుండి అంతకంటె ఉత్కృష్టమైన ప్రత్యుత్తరమేమి వుంటుంది. ధనమొక్కటే జీవిత సౌఖ్యము ఇవ్వలేదని వారెఱుగుదురు. అందుచేతనే హాలివుడ్డునందలి వైభవజీవితమూ, ధనము వారి నాకర్షింపలేదు. హాలివుడ్డుమాత్రమే వారి కుమారుని జీవితానికి సంపూర్ణమైన ఆనందాన్ని యివ్వలేదు. అది వారి ఆశయము.

తలిదండ్రుల మాట శిరసావహించి నా చదువు సాగించినాను.

కళాశాలలో చదువు ముగించి పట్టము పొందినాను. అపుడు మరల మెట్రోగోల్డ్విన్ మేయరు స్టుడియో వారు తమ నాట్యకళాపాఠశాలలో చదువుటకు ఆహ్వానించిరి. అందులోచేరి చదువు ప్రారంభించి వారాలైనా కాలేదు. ఇంతలోనే తండ్రిగారికి చాలా జబ్బుగావుందని తంతివార్త వచ్చింది. తలవని తలంపుగా వచ్చిన ఆవార్త నాలో కలిగించిన భయము, తరువాత నాస్థితి వ్రాయడానికి వీలుండదు.

వెంటనే మావూరు వెళ్లినాను. మా తండ్రిగారికి నెమ్మదిగనేవుంది. చాలా సంతోషంకలిగింది. 'నాకు నెమ్మదిగానేవుంది. నీ చదువుకు వెళ్లు నాయనా' అన్నారు తండ్రి నాలుగురోజులైనతరువాత.

వెళ్లబోయేముందు వారిముందు మోకరించి ఆశీర్వదించమన్నాను. చిరునవ్వుతో ప్రేమ తొణుకుతుండగా 'నాయనా! అదృష్టవంతుడవుకమ్ము. ఆనందాన్ని పొందివుండు' మంటూ ఆశీర్వదించినారు. అదే వారి అంతిమ ఆశీర్వాదము. తరువాత ఒకమాసము గడిచింది. తల్లిగారివద్దనుండి మరల తంతివార్త మానాన్న పరలోకగతులయినారని. అప్పటి నా యమయాతన ఎవరికి తెలుస్తుంది!

తండ్రి అస్తమించినారు. కాని వారు మా తల్లిలో మూర్తీభవించినారు. ఆమెకంటికి వా రెపుడూ అదృశ్యులుగారు. ఇంక నాసంగతేమిటంటే తల్లి నాతో ఎపుడూవుంటూవుంది. తండ్రిగారుకూడా అంతే. ఎందుకంటే ఈ ప్రపంచంలో నే నేమిగావున్నానో, వుండబోతానో అదంతా వారి కృపే; వారి సర్వస్వమూ నాలో నేవున్నాయి.

మొదట నేను నటించి ప్రఖ్యాతినిపొందిన రెండు చిత్రాలలోనా, నాపాత్ర ఒక డాక్టరుది. అందులో ఒకటి, మా తండ్రివలె, తాను ప్రేమించిన స్త్రీదృష్టిని బాగుచేయాలని చేసిన ప్రయత్నము. ఈ రెండు పాత్రలను నే నెంత నిపుణతతో నిర్వహించానో తెలియదు. కాని తరువాతనే నాకు పేరు ప్రతిష్ఠలు, వుద్యోగములో ప్రమోషను రావడము.

ఆదిలో నన్నొక సాధారణయువతితో నటింపమనినపుడు నేను రాత్రింబవళ్లు ఎంతగా భయపడ్డానో నేను మరువలేదు. అది జరిగి మూడేళ్లు కాలేదు. ఈకాలములోనే గ్రేటాగార్బో, ఐరీన్ డ్యూనీ, జానెట్ గేయర్, జోన్ క్రాఫోర్డు, బార్బరా స్టాన్విక్, జీన్‌హార్లో వంటి సుప్రసిద్ధతారలతో

నాయకపాత్రలను నిర్వహించాను. ఈ నాచరిత్ర వింటే నమ్మటకే వీలులేనంత విచిత్రముగా కనపడు తుంది.

నా జీవితములో స్థిరత్వము కలిగివున్నానంటే, చిత్రాల్లో నేకాకుండా ఏరంగములో నైనా, నే డిక్కు డుంటే రేపు ఇంకొకచోట వుండవలసివస్తుందనీ, అందుచేత ఎప్పుడూ తనవిధి తాను సాధ్యమైనంత వఱకూ ఉత్తమముగా నిర్వహించాలనీ, తెలిసికొని వున్నానంటే, అది మా తలిదండ్రులు చూపెట్టిన ఆదర్శమువల్లనే అని హృదయపూర్వకముగా చెప్ప గలను.

వారి జీవితములవలననే నాకు సచ్చిదానంద మే విధముగా కలుగుతుందో కనుగొన్నాను.

ఈలోపల ఇంకా ఒకటికూడా తెలుసుకుంటూ వున్నాను. అదేమిటంటే—అందరు స్క్రీనుటెస్టు ఓ. కె. అంటూవుంటే, అసలుపరీక్ష ఇంకా రాలేదు అని.





మీ వెంట్రుకలను కాపాడుటకు

## అమ్లా హేరాయిల్

(ఆమలక తైలము)

శ్రేష్ఠమైన ఉసిరికాయనూనె, వనమూలికలతో తయారుచేయ బడినది. ఇందు మట్టితైలము యేమాత్రమును లేదు.

శిరస్సునందలి వుష్ణమునుపోగొట్టి కండ్లకు మంచి చలవనిచ్చును. తలవెండ్రుకలను విరివిగా పెంచి, బట్టతల చుండు మొదలగువాటిని పోగొట్టును. నిద్రలేమి, వున్మాదము, తలనొప్పి, పోటు మొదలగు వ్యాధులను నిర్మూలము జేయును.

ధర ½ పౌ. రూ. 0–14–0. ¼ పౌ. రూ. 0-8-0.

ప్రతిచోటను జండువారి ఏజంట్లవద్ద దొరుకును.
లేనియెడల క్రింది విలాసమునకు వ్రాయుడు.

*Sole Distributors:*

**DAMODAR & Co.,**
**78, CHINA BAZAAR ROAD, G. T. MADRAS.**

## పల్లెపట్టులకు ప్రబోధములు వ్రాసినవా?

'పల్లెటూరి పడుచు'

నేను నిజమునకు పల్లెటూరివారిపడుచు నైనను పట్నవాసపువారి ఆడపడుచు నవుట చేత 'మనసులో మాటలు' నాబుర్రలో వేసుకొనవలెనను సంకల్పముతో నింటిపను లన్నియు పూర్తియైనపిమ్మట, అనాడు మా మామగారు తెచ్చిన 'గృహలక్ష్మి' చదువుచు కూర్చుండినాను. అందు 'మనసులో మాటలు' చదువుట పూర్తియగుసరికి నా మనస్సునందనేకయూహాశకటములు పర్వులెత్త మొదలిడెను. ఒక పుష్కరమునుండి పదునెనిమిదికోట్ల మహిళామణుల యభివృద్ధి నాశించి యమోఘమగు కృషిసల్పుచున్న మహిళోద్యమముయొక్క ఉద్దేశములు కూడ తెలిసికొనజాలని అధమస్థితియందున్న పల్లెలు గలవనువిషయమును సోదరీమణులు మరచినట్లు కాన్పించినది. మరచుటయే గాక తమ యుద్యమమునవలన స్త్రీలలో నవజీవనము గల్గినదనియు, ననేక నూతనాశయములతో స్త్రీలు విరాజిల్లుచున్నారనియు, తాము సభలొనర్చి తమయాశములను మూలమూలలకు వ్యాపింపజేయుచున్నామనియు ధైర్యముగా వ్రాయ సాహసించుచున్నారు.

ఈయుద్యమము మూలమున నవజీవన మేస్త్రీలలో కల్గినది? చదువుకొన్నవారిలో కల్గిన కలుగవచ్చును, పట్నవాసీయుల యందు కలిగిన కలుగవచ్చును. వారియందైనను విద్యాధికురాండ్రకే యీ స్వాతంత్ర్యాభిలాష నవజీవనోన్మాదము. కాని మిగిలిన నారీలోకమింకను అంధకారమున బడి యీదులాడుచున్నారు. అందు ముఖ్యముగా పల్లెటూరివనితాప్రపంచము గతి యధోగతియే యగుచున్నదిగదా! అట్టివారికి చేయూత నీయవలెను.

పల్లెటూరి స్వేచ్ఛావృక్షము నూతనముగా చిగిర్చి స్వేచ్ఛాపిపాసినుల కాధారమగుటకు మారు మొదటికే నశించి పోవుచున్నది.

నేడు పల్లెటూరిపడుచును జూచిన, నవనాగరిక శిరోమణియగు పట్నవాసపుపడుచున కసహ్యాను. తానెంతయో పెద్దచదువు చదువుచున్నానని తనతోడి సోదరీమణిని కన్నెత్తిజూచుటకే బరువు. ఏచదువు తన జీవితమున కుపకరింపదో, దేనివలన తన సోదరీమణులను, తనతో సమాన జన్మమెత్తి తాననుభవించుచున్న కష్టములనే యనుభవించుచు తానేమో గొప్పజ్ఞానము నార్జించినదను పిచ్చినమ్మకముతో దనయొద్దకు ప్రేమతో జేరజూచు స్త్రీనికూడ నసహ్యించుకొనునట్లు తాను తయారు చేయబడుచున్నదో, ధనవ్యయమునకు మూలసూత్రమగు పాశ్చాత్యనాగరికతావలంబన మేదిప్రసాదించుచున్నదో యట్టి అనుపయోగకరమగు విద్య నభ్యసించినంతమాత్రాన యీమెకంత గర్వమేలొకో? ఇక, పల్లెటూరి ప్రపంచమునకే నవనాగరిక వనితాలోక

మునుజూచిన కన్నెబ్బి. చదువుకొని స్త్రీని
జూచిన చదువురాని స్త్రీ కనూయ. కాని
తానుకూడ విద్యనభ్యసించవలెనను నాసక్తి
పట్టుదల నున్న. ఆసక్తియున్నను అను
భవమునకు మార్గ మరికట్టబడినది. ఆమార్గ
మును తెరువవలెను. మనయందలి పరస్పర
భేదాభిప్రాయములు, అసూయా సహ్య
ములు తొలగిపోవలెను. అట్లు తొలగింప
జేయుటకు ప్రవర్తనాబలము, జాతీయాదర్శ
ముల పెంపొందింప జేయునట్టియు, సర్వ
సోదరీప్రేమకు స్థానమును, పట్టుదల, స్వార్థ
త్యాగముల కిక్కయు నగువిద్య నభ్యసించి
నట్టి వీరనారీమణులు నడుము గట్టవలెను.
విద్యకొఱకు విదేశములకు సహితమేగి గొప్ప
పట్టణములనుబొందిన సోదరీమణు లనేకవిష
యములను పత్రికలద్వారా తెలియపరచ
గలిగి యుండవచ్చును, గాని యవి విద్య
నభ్యసించినవారికిదక్క తదితరులకు గ్రుడ్డి
వానిచేతి దివ్వెవంటివే! క్రమముగా పల్లె
టూరి బాలికలు విద్య నభ్యసింప మొదలిడి
యే నాల్గవతరగతివఱకైనను చదివినను
పుస్తకమువదలి, కుండచేపట్టిన మరునటి
దిన, మావిద్య కగ్నిప్రవేశము. ఇట్లున్నది
పల్లెటూరిపడుచుల విద్యాభ్యాసము.
ఇందు కే సంస్థయును శ్రద్ధవహింపనందున
పల్లెటూరిబాలికల జీవితము లడవిగాచిన
వెన్నెల యగుచున్నవి. సభలమూలమున,
వార్తాపత్రికలమూలమున మహిళోద్యమో
ద్దేశములు మూలమూలలకు వ్యాపింప
జేసినను విద్యావిహీనలగు పల్లెటూరివారి
కవి చెవిటివానియొద్ద యూదినశంఖముగతి
నిష్ప్రయోజన మగుచున్నవి. అంధకారము
నందున్న పల్లెటూరి నారీసంఘమునకు నవ
జీవనము, నూతనవికాసము కలుగవలెన్న
చంచలమును నస్థిరమునగు వెల్గునొసంగు
మిణుగురు బుర్వులుకాదు కావలసినది — స్థిర
మగు వెల్గు నొసంగజాలు తారాగణము!

మహాత్ముడు చాలకాలము పట్నవాసము
లతో ప్రాకులాడి తుదకు పల్లెటూళ్ళను పట్టి
నాడు స్వరాజ్యసంపాదనకు. పల్లెటూళ్లపై
స్వరాజ్య మాధారపడియున్నదని ఘంటా
పథముగా జెప్పుచున్న మహాత్మునివాణి
యమృతవాణియే! సందేహములేదు. మహా
త్ముని స్వరాజ్యశంఖము పల్లెలయందు
పూరింపబడిన మరుక్షణమునందే, విద్యా
విహీనలయ్యు పల్లెటూరిస్త్రీలు సర్వమును
త్యజించుటకు సంసిద్ధలైనారు. అట్టిమార్పు
వలనకల్గిన ఫలితమెల్లరమును కాంగ్రెసువారి
శాసనసభా ప్రవేశమహోత్సవమువలన
తెలిసికొనియే యున్నాము. ఇది వారు
మహామహులగు దేశసేవకుల ప్రబోధము
లును స్వయముగా వినగల్గుటవలననే జరిగి
యున్నది. అంతియేగాని స్త్రీలు వ్యక్తి
స్వాతంత్ర్యము కొఱకుగాని, విద్యాభివృద్ధి
కొఱకుగాని, ఆర్థికోపపత్తికొఱకుగాని
త్యాగము చేయలేకున్నారు. అట్లు
చేయించుటకు స్వయముగా గ్రామము
లన్నియు సంచారమొనర్చి వారికి ప్రబోధ
మొనరింపవలెను.

పల్లెటూరివారిని దాస్యశృంఖలముల నుండియు, అపోహాపిశాచములనుండియు రక్షించుటకు నేడే సైన్యసమేతముగా దాడి వెడలవలెను. వారెన్న డుద్ధరింపబడుదురో నాడే సర్వ స్త్రీలోకమునకును వసంతోదయమగును. సాంఘికముగా జాల వెనుక బడియున్న పల్లెటూరిస్త్రీలు కండ్లుతెరచిన మనకు నిర్బంధశాసనముల యవసరముండదు. "ఇంటగెలచి రచ్చగెలువు" మను నార్యోక్తిని సోదరీమణులు మరువకుందురు గాక! హిందూదేశప్రాశస్త్యము పల్లెల యందే యిమిడియున్నది. అట్టి కేంద్రస్థానములగు పల్లెలను మొదట జయించవలెను. పల్లెటూరి పడుచులసాహసము, పట్టుదల, కార్యశూరత్వము అందఱికి తెలిసినదే. అట్టివారిసాహాయ్యమున మనము విశ్వమును జయించగల్గుదుము.

కూపస్థమండూకములై, ప్రపంచమన నేమియో, సంఘమన నేమియో, తమకున్న హక్కులేవియో, కావలసినహక్కు లేవియో కూడ తెలిసికొనుటకు వీలులేని, చేతగాని అసహాయస్థితియందున్న సోదరీమణులకు చేయూతనిచ్చి వారియందు నిండినిబిడీకృతమైన స్వాతంత్ర్యాగ్నిజ్వాలల రగుల్కొల్పినవారు నిద్రనుండి మేల్కాంచి యాకలిగొన్న యాడుసింగముల రీతి నీదురాచారా సంఘ జీమూతముల జీల్చి జెండాడు నపుడు స్వాతంత్ర్యముదారి పాదాక్రాంతము గాక మానునా! దాస్యశృంఖములనుండి విడివడుటకు గానలసిన ఉత్తేజము, ప్రభావము, దీక్ష, పట్టుదల, దేశీయపతాకను స్మరించిన తప్పక కలుగగలదు. వ్యక్తిస్వాతంత్ర్యమునందును, ఆర్థిక, విద్యావిషయములయందును పురుషులతో సమానముగా మనముగూడ స్వేచ్ఛ ననుభవింపవలెను. అవి పురుషులే సంపాదించినవి గావు. కాని పురుషులు తమ స్వార్థపంజరమున వానిని బంధించియున్నారు. ఆపంజరమును నుండి వానిని విడివడజేయవలెను. నాడే మనమెల్లరమును సంపూర్ణస్వాతంత్ర్యదుర్గమును జయించిన వీరనారీమణుల మగుదుము. అట్టిజయముకొరకే నేటి దండయాత్ర. అందుకే పతాకము, పవిత్రత, ఉత్తమాశయములు, సర్వమానవ ప్రేమ యను నాయుధములతో, వీరనారీ లోకమంతయు స్వాతంత్ర్య సముపార్జనార్థము పతాకములనుచేబూని బయలుదేరవలెను. పతాకము చేపట్టినంతమాత్రాన లాభము లేదు. సైన్యముకావలెను. అందుకే ముందుగా పల్లెటూళ్ళపై దాడి. పిమ్మట దిగ్విజయయాత్ర. ఈదిగ్విజయము మహిళోద్యమకల్యాణమునకేగాక, భారతదేశ కల్యాణమునకుగూడ మార్గమగును.

అట్టి పవిత్రోద్దేశ్యములతో విరాజిల్లు పతాకరాజ మెట్లుండవలెనను విషయ మంతగా నన్ను కలవరపెట్టజాలకపోయెను. సర్వమానవకల్యాణమునకు సాక్షిభూతములగు పసుపు, కుంకుమలుండ పతాకవర్ణములకై పరుగులిడవలసినయగత్య మగుపింపలేదు.



మిస్. తంగిరాల అన్నపూర్ణ
లాహోరునందలి మద్రాసు క్లబ్బు వార్షికోత్సవ సమయమున
సితారుపై సంగీతప్రదర్శనము గావించిన ఆంధ్రకుమారి.

# కాశ్మీర మజిలీలు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

(స్తంభాగ్రము 4)

ఘోరప్రళయము విఱుచుకొని తలపై పడినట్లు పొట్టిపిచికి యఱువసాగినాడు. వెలికిలబడి, కుమ్మరిసానమీది చక్రమువలె గిఱ్ఱున తిరిగిపోవుచున్నాడు. ఆకస్మికముగ వీడిట్లేల విజృంభించుచున్నాడో మాకు బోధపడలేదు. ఉన్నట్లుండి వీనిమెదడు తలక్రిందులైనదేమో! ఉడికియుడికి యూడిపడనున్నదేమో! నిముసములో నేదేని పిశాచము వీనినివరించి, సందిట జేర్చి నొక్కివేయుచున్నదేమో! ఎంత యోచించినను, మీనమేషము లెట్లు లెక్కించినను కారణమేమో తెల్లముకాలేదు. "హా! హా!! హా!!!" అనియఱచుచు బుడంకాయిగాడట్లే తిరిగి పోవుచున్నాడు. "క్యాహువా? భయ్యా!" ("ఏమైనది? సోదరా!") అని వృద్ధుడు ప్రశ్నించినాడు. "చిల్లావ్ మత్, బోలో క్యాహువా" ("అఱువకుము; ఏమైనదో చెప్పు") అని నేనంటిని. మామాటలను వాఁడు చెవిబెట్టలేదు. తనధోరణిలో తానున్నాడు. కొంతసేపట్లే యఱచియఱచి, అదూరమందున్న ఒక యరటిపండు తొక్కజూపి దానిని పలురీతుల దిట్టసాగినాడు. దానిపై కాలువేసి, జారిపడినాడని గ్రహించి మెల్లగ దానిని లేవదీయబూనుకొంటిమి. లేచుటకు వాఁడు సమ్మతించినాడుకాడు. "గిర్ గయా! గిర్ పడా!" అనుచు వికృతముగ కూయసాగినాడు. దెబ్బ తీవ్రముగ తగిలినదేమోయని పరీక్షించితిమి. మాకట్టిదేమీ యగపడలేదు. కాని వాడు చేయు శబ్దమువలన అమృతసరమంతయు మారుమోగుచున్నది. అంతకంతకు కంఠము హెచ్చుస్థాయిలోనికి పోవుచున్నది. వీని చర్యజూచి పాపము వెంటనున్న ముదుసలి నిర్విణ్ణుడై పోయినాడు. "ఏమిబుద్ధి!" అని యొకనిట్టూర్పువిడిచి ఆతడట్లే నిలువంబడి పోయినాడు. అటూత్తుగ నదరిపడినంత మాత్రమున వీడు బ్రహ్మాండమును పగుల జేయ నుంకించినందులకు నాకు నవ్వును కోపమునుగూడ రాదొడగినవి. "బస్! బస్! ఉఠో!" ("చాలు! చాలు! లే!") యని యఱచితిని. కాని వాడట్లే పడియుండెను. ఇంచుకతడసిన "ఈతని నిందే యుండనిండు. మనమిరువురముపైకిపోయి చూచివత్తుము" అని సిక్కువృద్ధుడుపలికి మీదికి దారిదీసినాడు. "పైకిరాలేవు. ఇందే యుండు"మని బుడంకాయిని మెల్లగదట్టి ముదుసలివెన్నంటి స్తంభమెక్క సాగితిని.

ఇంచుకసేపు చీకటిలో తడుముకొని పోవలసివచ్చునని యోచించితిని. కలకత్తా ఎస్ప్లనేడ్‌లోని స్తంభము (Monument) నెక్కుతఱి కొంతసేపటివఱకు చీకటికోణము తప్పదనియెఱుగుదును. కాని, మమ్మిపు డంధకారము మూర్కొనలేదు. వడివడిగ

నలువదిమెట్లు నెక్కితిమి. క్రిందనుండి యపుడు "హుం! హుం!" అను శబ్దములు వినవచ్చెను. ఇవి క్రమక్రమముగ సవిరాపించునట్లుతోచెను. ఉరుగొట్టుచున్నది ఏదో జంతువని వృద్ధు డూహించినాడు. నిముసము నిలువంబడియుంటిమి. ఇంతలో నెగురుచు నెగురుచువచ్చు బుడంకాయిగాడు మమ్ముల జేరుకొని పకపకనవ్వినాడు. "దెబ్బ ఏమైనదిరా?" అని యడిగితిని. జవాబుచెప్పక, నురుగొట్టుచు,నవ్వుచు పొట్టిపిచికి మూకంటె ముందుగ, తూరీగవలె పైకి నెగిరిపోయినాడు. ఎట్టకేలకు మేమును కొనజేరితిమి.

సప్తాశ్వుడ స్తమించినను, సప్తరాగము లస్తమించలేదు. మహాకవి యంతరంగమువలె వియత్తలము కడుంగడు సుందరమైయున్నది. చూచినకొలది రంగులు మఱింత స్ఫుటమైతోచినవి. మొగిళ్ళమఱుగున నెవరో వింతవింత హోమములను జరపుచుండిరేమో! కావుననే ఏడురంగులమంటలు నిభృతమునుండి ఎగసి నీలంపువింటిపై వడివడిగ బడుచున్నవి. ఆహా! బహుళరాగసందీప్తమైన ఆదృశ్యమెంత యద్భుతమైనది! కారుమబ్బులామంటలం దంటుకొని ఎట్లు చిత్రవిచిత్రరూపములను దాల్చుచున్నవో! అడలుగొలుపు నరిష్ట జీమూతపటలము సదాశసద్భక్తి సద్భావప్రభృతి యాంతరంగిక శక్తుల కతన నిట్లు దహనమై నవ్యరూపులు దాల్చి తొంటిగొనముల మార్చుకొనును గదా! ఏడురంగులనెరసులు తెఱపిలేని తళ్కులై మింటినుండిమంటిపై రాలుచున్నవి. తళ్కులం దెగసిమెగసి, వాని జన్మస్థలముచూడవలెనని మిక్కిలి మక్కువపడి నాయాత్మ దివిదేన రివ్వుమనినది. ఆహా! అదెట్టివయనము! సప్తకాంతులందు మసలు టెట్టియదృష్టము! పెరతలపులు మనసుపై దాడివెడలనిచో భావనావీథులం దెగసి, అదెట్టి రమ్యదృశ్యములను విలోకింపదు? బంగరు చేలముదాల్చి స్మితముఖియై స్వర్గ మెదురై మధురస్వరమున స్వాగతగీతముల నాలపింపదా? నందనమందలి మల్లెపందిళ్లపై నిక్కంపుచుక్కలవలె వెలయుపూవులు జలజల తలపై రాలవా? చందురుడెదురై పథశ్రమము పాపుచు, తనివారగ్రోలుమని దోసిట నమృతపూరముపోయడా? అచ్చరలందలము లెక్కించి ఎన్నెన్ని వింతదృశ్యములను చూపరు? "సూర్యుని రథముపోయిన జాడలివి"యని, "రోహిణీసహితుడై సుధాకరుడు తఱచుగ నిందు విహరించుచుండు"నని, "శర్వరీసమయములందు గంధర్వాంగనలిచ్చోటున నృత్తగీతముల దేలుచుందు"రని "ముక్తిదూత లిందుండియే, మురళీరవమును వినినంతన దివ్యబృందావనమున బ్రవేశించి"రని, దివిగల వింతచోటులందు దేవదూతలు త్రిప్పరా?

స్తంభము మఱింత ఎత్తైయుండినచో, జివాలున మేఘభిత్తికలపై లంఘించి సప్తకాంతుల నిచ్చమెయి మేననలందికొని మురియవలెనని తలపోసితిని. ఆశాద్యుతులను విలోకింపవలెననిన, సృష్టిసౌందర్యమును గనులార జూడవలెననిన, ఈశ్వర

మహత్త్వమును హృదయంగమ మొనరించుకొనవలెనని భావభాస్వన్మరీచికలను మనసున నింపుకొనవలెనని, అంతరంగమున నానందమును పొంగింపవలెనని, హృదయఫలకమున నమృతకలశమును నిలుపవలెనని, ఐహికజీవనమున సుధాబిందువులను చిల్కరింపవలెనని, పంకిలమయమైన పరిస్థితులనుండి చిత్తమునుకదలించి కొండాక ప్రశాంతసమయమున మానవుడు తన చూడ్కి నూర్ధ్వదిశకు లగింపవలెను. "బంగారు సంకెలలతో నీశ్వరచరణములకు వసుంధర బంధింపబడిన"దనికదా టెన్నిసన్ మహాకవి వాకొనినాడు. (Vide: Marke-De Arthur in the "Idylls of the King") ఈశ్వరచరణములకు వసుమతి లగ్నమై యుండుటచే కాబోలు వానినుండి యవిరళముగ స్రవించు సౌందర్యకల్లోలిని సంపూర్ణముగ పృథ్వీహృదిఁబడుచు, నందద్భుతసృష్టిని తళ్కొత్తించుచుండెను.

వృద్ధు డమృతసరమందలి వివిధప్రదేశముల నంగుళితో జూపదొడగి, నాభావస్రోతమును పుటుకుక్కన ద్రెంపినాడు స్తంభమునుండి నలువలంకులను తేఱిచూచితిమి. దూరముననడచు పాంథులు పిపీలికలవలె దోచిరి. ఉన్నతగృహములు పిచుకగూండ్లవలె గన్పట్టినవి. ఉన్నతభావ వీధినుండి విలోకించినచో, నైహికసామగ్రులు కడుంగడు క్షుద్రములై యగపడునుగదా! బంగారుగుడిపై దృష్టిసారించితిమి. ఏకిన్నెరకాంత నగలమూటయో దివినుండి జేలరాలెనని యూహించితిని. అంతరిక్షమునుండి కువలయమున కుంభవృష్టిగ కురియు కాంతులే మందిర పురోభాగమున దివ్యసరోవరమాయెనని తలంచితిని.

ఆహా! మనుష్యదృష్టియం దెట్టియద్భుతశక్తికలదో! నిలిచి రెప్పలు తెఱచినజాలును, గుండెలో జ్వలించు జిజ్ఞాసానలమునుండి రెండు నెరసులనుదీసి దృష్టియందు చొప్పించినజాలును. దృష్టిని దివ్యజ్యోతిఁ గావించుటకు,—పరంజ్యోతిఁ జేసికొనుటకు నక్కరైనశక్తి హృదయమందేకలదు. ఇందుండి ప్రసరించు వెలుగుపోజాలని తావేది? రెప్ప తెఱచినంతనజూడ్కి యెంతదూరమో పోయి వ్రాలగలదు. అనంతయోజనముల దూరమందు మిణుకుమిణుకును చుక్కలతో నిదిచప్పున సఖ్యము సలుపగలదు. గిరిశిఖరమునుండిప్రాలి, పాతాళమందలి పుష్పమోముల ను చుంబించి, గబ్బునమరలి నక్షత్రమండలమందలి నెచ్చెలులతో సయ్యాట లాడగలదు. చూడ్కినంటియే మనసుండును. మనసుతోడనే యనుభవముండును, అనుభవమేగదా జీవనవిధానమందలి ప్రధానాంశము! ఒక్కచూడ్కివలన మానవుడు బ్రహ్మాండమం దెల్లెడలఁ జుట్టఱికములు గలుపుకొని యెట్లు విహరింపగలుగుచున్నాడో దుర్భిణిని కనుల ముందిడికొని తనయాగారమందే విడసియుండియు భౌతికశాస్త్రవేత్త బహుళభువనములందు దృష్టిని జరింపజేసి యెంతవిజ్ఞానము నెంత యానందము నందుచుండునో యోజింపుడు. కొండాసింగార

మున నొంటరినై తలయెత్తినిలిచి కవికుమారుడు నేత్రద్వారములగుండా యనంత విశ్వమును దన చిన్నిగుండెలోనికి జేరవేసికొని యాంతరంగికముగ నెంత హాయి నందుచుండునో తలపోయుడు. భావనాశక్తికతన బహుభువనములను దండగ గ్రుచ్చుకొని ధరించి కులుకుచునుండు పూజారిగాడు దృష్టిబడిన సుదూరసుందర దృశ్యములనెట్లు మక్కువమెయి మనసున జొప్పించుకొనునో గ్రహింపుడు.

సాధారణదృష్టి క్రమతపసుకతన దివ్యదృష్టియై త్రికాలములందును సంచరించి మనసున జేరవేయు భావివిభూతి యెట్టిదో యూహింపుడు. చూడ్కికతన మనుష్యజన్మ మెంత మహత్తరమైనది కాగలదో భావింపుడు.

కొంతసేపట్లె స్తంభాగ్రమునసిలిచి విహాయసచిత్రములకు కనులప్పగించి వానికి ప్రతిచిత్రములను హృదయవియత్తలమున చిత్రించుకొని అల్లనల్లన క్రిందికి దిగితిమి.

బుడంకాయిగాడు మఱి కిక్కురుమనుట మానివేసినాడు. అఆదియఆచి వాని గొంతుక సొమ్మసిలియుండును.

మెల్లగ ప్రస్తరమార్గమునుండి కదలిపోతిమి. మిత్రుని, బుడంకాయినిజూచి ఎప్పటట్లు నవ్వుచు భూగోళమువంటి బొజ్జనుండి ఇంచుకచేతులెత్తి "సబ్ దేఖ్ చుకా క్యా?" ("అంతయు జూచితివా?") అని సింగు ప్రశ్నించినాడు. ఒక్క వాడిచూడ్కిని మాత్రము పిచికిగాడు వానిపై రువ్వినాడు. ఈపరాయ్యయము వానిబొజ్జను మూర్కొని కుమ్మికుమ్మి వదలలేదు. సింగునకు కొన్ని యణాలిచ్చి మాజోళ్ళను మేము తొడుగుకొని సంతసమున వానితో నించుకసేపు ప్రసంగించి అనంతరము దాపుననున్న బస జేరుకొంటిమి.

మేము విడిసినది సూరజ్ మహారాజను మిత్రునియింటగదా! గుడిలో పరిచితుడైన సిక్కువృద్ధుడుకూడ మాతో నచటికి వచ్చినాడు బల్లపై దాదాజీ * హుక్కాను పీల్చుచున్నాడు. మమ్ములనుచూచినంతన "ఆయియే!" ('దయచేయుడు') అని యాతడాహ్వానించినాడు. నాకును తనకును కలకత్తాలోగల పరిచయమును గుఱించి దాదాజీ సిక్కువృద్ధునకు దెలిపినాడు.

ఇంతలో రాత్రిస్నానము ముగించితిని. అందఱముకలసి చపాటీలను మెక్కితిమి. బుడంకాయముఖమున క్రోధచిహ్నములు స్పష్టముగాదోచినవి. ఆలయప్రసాదము,-హల్వాలభించునని ఆత డాశపడినాడు.

అనంతరము దాదాజీ ప్రభృతులలో గూడ సిక్కువృద్ధుని వేడికోలు ననుసరించి తిరిగి స్వర్ణాలయమున కరిగితిమి. పూర్ణిమ! పండువెన్నెల!

* ఈతనియుదంతము వెనుకటి మజిలీలందుండుట పాఠకు లెఱిగియుందురు.




మెట్లు యెక్కినట్లుగా బాలపాపల ఆరోగ్యము ఒకనాటి కింకొకనాటికి అభివృద్ధి నందుతూ రావాలి. ఆరోగ్యమంటే అదీ ఆరోగ్యము.

కాని నేడు బాల బాలికలు చాలమంది పాపము మొదట ఆరోగ్యముతో కలకల లాడుతూ వుండి, హఠాత్తుగా మధ్యలో దిగవారిపోవడము మనము చూస్తున్నాము.

ఇది యకృత్ ప్లీహోదర వ్యాధి లక్షణము. కాళ్లు పూచికపుల్లలై, కడుపు "ఢమార"మై, కనులు పచ్చబడి మలబద్ధమేర్పడి యమయాతనకు లోను చేస్తుంది జాడ్యము. దానికి

**బాలభాస్కర**

ఒకటే సరియైన ప్రయోగము. పసిబిడ్డల ఆరోగ్యమునకు బాలభాస్కర సంజీవివంటిది. బాలభాస్కర అన్ని మందుల షాపులలోనను దొరకును.

ఆయుర్వేదాశ్రమము

(స్థాపితము 1898), మదరాసు



# బాలక్రీడలు

శిష్టా దక్షిణామూర్తి శాస్త్రిగారు

7-వ సంవత్సరము విద్యార్థులకు

## 1. పిట్టలకలరవము




* వేటకాడు.

ఆటస్థలము 20 గజముల పొడవు 20 గజముల వెడల్పుగనుండునట్లు గీయుము. ఎదురుమూలలను ఏటవాలు గీతతో కలుపుము. మిగత రెండు ఎదురుమూలలందు 5 గజముల పొడవు 5 గజముల వెడల్పుగల రెండు చిన్న చతురముల నేర్పాటుచేయుము. ఒకమూలనున్న చిన్న చతురమును గూడనియు, రెండవదానిని పంజరమనియు పేరులను పెట్టుము.

ఈ ఆటకు 10 నుండి 21 టి వరకు బాలురుండవచ్చును. ఒకనిని వేటకాడనుపేరుతో ఏటవాలు గీతపై నిలబెట్టుము. మిగత బాలురను మూడు సమభాగములు చేయుము. ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్కపేరు పెట్టుము. కాకులు, కోవెలను, చిలుకలని పిలువుము. మూడురకముల పిట్టల యఱపులను మూడుభాగములుగల పిల్లలచే వేరువేరుగా అరచునట్లు అభ్యాసముచేయించుము. పిట్టలను గూటియందుంచుము.

ఉపాధ్యాయుడు ఈలవేయగానే పిల్లలు కలకల ధ్వనులతో (కాకా, కోకో, అక్కక్కాయని) కలవరముచేయుచూ ఏటవాలు గీతదాటి, వేటకానిచే పట్టుబడక ఇటునటు

కవ్వించుచూ తిరుగుచుండవలెను. గీతను దాటునపుడెల్ల తనచే చిక్కుపడిన పిట్టను వేటకాడు పంజరములో పెట్టుచుండవలెను. అన్నిపిట్టలు పట్టుపడిన తరువాత యింకొకనిని వేటగానినిగ నియమించి ఆడించుచుండవలెను. కవ్వించునపుడెల్ల పిల్లలు ఎక్కువ సంతోషపడుచుందురు.

## 2. ఉడుతలు — ఉడుములు.

20
[...... 10 ...... | ...... 10 ......]
× 10 — అ 1½ — అ 1½

బాలురను రెండు సమమగు జట్లుగా విడదీయుము. జట్టునకు 10 మంది బాలురు ఉండవలెను. ఒకవైపు జట్టుకు ఉడుతలనియు, రెండవవైపు జట్టునకు ఉడుములనియు పేర్లు పెట్టుము.

ఆటస్థలము 20 గజముల పొడవు 10 గజముల వెడల్పుగ నుండవలెను. దానిని రెండు సమభాగములుచేసి మధ్య గీత నడ్డముగాగీయుము. ఆగీతకు యిరుప్రక్కల 1½ అడుగుదూరములో రెండుగీతలు గీయుము. వీటిని నియమితరేఖలందురు.

ఒక నియమితరేఖమీద ఉడుతలను రెండవ నియమితరేఖమీద ఉడుములను నిలబెట్టుము. నియమితరేఖకు 10 గజములదూరమున గమ్యస్థానములుండును. ఉపాధ్యాయుడు ఈలవేయగానే రెండు జట్ల బాలురును తమ ఎడమకాళ్ళనుంచియు కుడి కాళ్లను వారివారి వెనుకవైపునుంచియు నిలువవలెను. ఉపాధ్యాయుడు మధ్యగీతపై నిలువవలెను. ఉడు—ఉడు అని కవ్వించుచూ ఒకసారి ఉడుతలనియు యింకొకసారి ఉడుములనియు కేక వేయుచుండవలయును. "ఉడుతలు" అని కేకవేయగానే ఉడుతలు తమవైపునగల గమ్యస్థానమునకు పరుగెత్తవలెను. ఉడుములు వెంటనంటి ఉడుతలను పట్టుకోవలెను. గమ్యస్థానముచేరిన ఉడుతను పట్టుకోరాదు. ఇటులనే "ఉడుములు" అని కేకవేయగానే ఉడుములు తమ గమ్యస్థానమునకు పరుగెత్తవలెను. ఉడుతలు ఉడుములను వెంట నంటిపట్టుకోవలెను. ఉపాధ్యాయుడు ఈలవేయవలెను. ఈలవేసినపుడెల్ల ఉడుతలు ఉడుములు మధ్య రేఖకు ఇరుప్రక్కలనున్న నియమితస్థానములందు చేరి నిలుచుండవలెను. ఉడుతలు ఎన్ని ఉడుములను పట్టుకొనునో అన్ని మార్కులు సంపాదించును. ఈరీతిగా ఉడుములు పట్టినప్పుడు మార్కులను వేయుచుండవలెను. ఎక్కువ మార్కులను సంపాదించిన జట్టునకు జయముకలుగును 20 మార్కులు ఆటజయమును సూచించును. ఈక్రిందిరీతిగా మార్కులబట్టికను తయారుచేసిన బాలురకు ఉత్సాహము హెచ్చును.

మార్కుల పట్టి

| తడవ | ఉడుతలు | ఉడుములు | షరా |
|---|---|---|---|
| 1 | 4 | — | ఉడుములకు జయము |
| 2 | — | 6 | |
| 3 | 2 | — | |
| 4 | — | 6 | |
| 5 | 8 | — | |
| 6 | — | 8 | |
| 7 | 4 | — | |
| మొత్తం | 18 | 20 | |

ఉపాధ్యాయుని వ్రాలు

### 3. యజమాని — డేగ — పావురము

[........20 గ.........]

15 గ

డేగ

యజమాని

పావురము

ఆటకు ముగ్గురు లగాయతు 30 మందివరకు ఉండ వచ్చును. ఆటస్థలము 20 గజముల పొడుగు. 15 గజముల వెడల్పుగనుండునట్లు గీయుము. ఆటస్థలములో నచ్చటచ్చట ముగ్గురు ముగ్గురు బాలురవంతున నిలబెట్టుము. డేగయని యొకరికిని, యజమానియని యింకొకరికిని, పావురమని మఱి యొకరికిని, పేర్లుపెట్టుము. డేగ పావురమును పట్టకుండా యజమానిమధ్య నిలువవలెను. ఉపాధ్యాయుడు ఈలవేయగానే డేగ పావురమును పట్టుటకు యత్నించవలెను. పావురము యజమానునిచాటున నక్కుచుండవలెను. యజమాని డేగను పావురమువైపు రానీక నెట్టుచుండవలెను. యుక్తి మిక్కిలి అవసరము. కవ్వించుట వేటాడుట డేగ గమనించ వలెను. యజమాని జాగ్రత్తతో సంచరించవలెను. మరల మరల ఒకరిస్థానమున నొకరిని మార్చి ఆడించుము.

### 4. ఒంటికాలికుంటు

రెండు సమజట్టులుగా విడదీయుము. జట్టుకు 10 మంది బాలురు ఉండవలెను. రెండు జట్టులకు మధ్య 5 అడుగుల దూరముండవలెను. జట్టులోని బాలురు ఒకరివెనుక నొకరుచేయి ఎడముగా నిలువవలెను. ఆటస్థలము:—జట్టులకు ముందు నియమితరేఖ యుండును. నియమితరేఖనుండి 20 గజములదూరములో గమ్యస్థానరేఖను గీయుము.



ఆరేఖమీాద చుక్కలు పెట్టిన చోటు లందు జట్టులకు సూటిగా ఇద్దరు బాలురను కూర్చుండబెట్టుము.

ఉపాధ్యాయుడు ఈలవేయగానే ప్రతి జట్టులోని మొదటిబాలుడు ఈపటములో చూపినట్లు ఒకకాలు వెనుకకువంచి కుంటుచూ గమ్యస్థానరేఖకు చేరవలెను. తమ జట్టుల కెదురుగానుండు బాలురచుట్టు దిరిగి తమ జట్టువైపు పరుగెత్తివచ్చి, రెండవ బాలునితాకి తాము జట్టువెనుక కూర్చుండవలెను. అంతట రెండవబాలుడు ఒంటికాలుతో కుంటుచు గమ్యస్థానముచేరి మొదటివానివలె వచ్చి మూడవవానిని పంపవలెను. ఇట్లు ఆఖరుబాలునివరకు వరుసక్రమముగా కుంటించి, పరుగెత్తించుచు తమజట్టు ప్రవేశించు చుండునట్లు బోధించవలెను. ఏజట్టులోని ఆఖరుబాలుడు ముందు ముగించునో వాని జట్టునకు విజయము సమకూరును.

## 5. కప్పగంతు.

పై ఆటలవలె జట్టులు విడదీయుము. జట్టుకు 10 మంది ఉండవలెను. ఒకరివెనుక నొకరిని వారి మడమల మీాద కూర్చుండునట్లు ఆజ్ఞనిమ్ము. నియమిత గమ్యస్థానములమధ్య ఇరువదిగజముల దూరముండవలెను.



ఉపాధ్యాయుడు ఈలవేయగనే జట్టు మొదటిబాలుడు ప్రక్కపటములో చూపిన రీతిగా చేతులవ్రేళ్ల చివర నేలనాన్చి కాళ్లతో గెంతులువేయుచు గమ్యస్థానరేఖజేరి నిలచి, జట్టువైపు తిరిగి పరుగెత్తుచువచ్చి, జట్టులోని రెండవబాలుని తాకి, తాను జట్టు వెనుక నిలువవలెను. తరువాత రెండవవాడును, పిమ్మట మూడవవాడును ఆఖరువాని వరకు మొదటివానివలె తరువాత వానిని పంపుచుండవలెను. ఆఖరువాడు జట్టుముందుకు పరుగెత్తుచువచ్చి నిలచి చేతుల నెత్తవలెను. ఏజట్టులోని చివరబాలు డీపని ముందు ముగించునో వానిజట్టునకు జయము. పిక్కబలము హెచ్చును.

## 6. పీతనడక.




జట్టుకు 10 వంతున రెండు జట్టుల బాలురుండవలెను. ఆటస్థలము పై వాటివలె నియమిత గమ్యస్థానములకు మధ్య 20 గజములుండవలెను. నియమిత రేఖకు ఎదురుగా నిలచిన జట్టులను, వెనుకభాగమున నియమితరేఖయుండునట్లుగా త్రిప్పుము. అందరి ఎడమకాళ్లను ఎడమప్రక్కకు $1\frac{1}{2}$ అడుగు వేయుమని ఆజ్ఞనిమ్ము. ప్రతిబాలుడు చేతుల భూమిమీాద నుంచి తలనువంచి, కాళ్లమధ్యగా గమ్యస్థానమున జట్టుకెదురుగానున్న బాలుని చూచుచుండునట్లు ఆజ్ఞనీయవలెను. ఉపాధ్యాయుడు ఈలవేయగానే నియమితరేఖపై నున్న కాళ్ల నొక్కొక్కదానినే ఎగురవేయుచు, వెనుక బాలుడు వెనుకకు నడుచుచు గమ్యస్థానము చేరవలెను. గమ్యస్థానరేఖపైనున్న బాలుడు తనచేతితో వెనుకకు నడచుచూ వచ్చిన వాని పిఱ్ఱను తాకవలెను. అంతట అతడులేచి నిలబడి, పరుగెత్తుచూవచ్చి రెండవవానిని తనవలె వెనుకకునడచి గమ్యస్థానము చేరునట్లు పంపవలెను. ఇట్లు ఆఖరు వానివరకు చేయించవలెను. ఏజట్టులోని ఆఖరుబాలుడు ముందు పీతనడక నడచి తనచోటు చేరి, నియమితరేఖపై నిలచి, చేతినెత్తునో వాని జట్టునకు జయము సమకూడును.

పరా:— గమ్యస్థానమందున్న రెండవజట్టు బాలునివైపు వెళ్లరాదు. చేతుల నేలనాన్చి నడవవలెను. చూపు కాళ్ల మధ్యగా చూడవలెను.

('ప్రకృతి')

—:o:—


## కావలెను

ఏలూరు, కాకినాడ, బరహంపురము, అనకాపల్లి, గుడివాడ మొదలగు స్థలములందు 'గృహలక్ష్మి'కి ఏజంట్లు కావలెను. వివరములకు వ్రాయుడు.



# మీ రెండు చర్మములను సుందరతమముగా జేసికొనుడు

నల్లనిచుక్కలు, గీరలు, ముడుతలు క్రిందిచర్మమున బైలుదేరునపుడే పైచర్మమున గరకుతనము ప్రారంభించును. త్వరలోనే క్రిందిచర్మమునగల తైలగ్రంథులు నశించును. కావుననే నల్లనిమచ్చలు పుట్టును. అపుడు క్రిందిచర్మము క్రుంగిపోయి ముడుతలు గీరలు ఏర్పడును. సౌందర్యముకొరకై యీ రెండుచర్మములను వేరువేరుగా శ్రద్ధవహింపుము.

నల్లనిమచ్చలు గీరలు, ముడుతలు: ప్రతిరాత్రి పాండ్స్ కోల్డుక్రీము పూయుచున్నచో, క్రిందిచర్మపు తైలగ్రంథులను మరల ఆరోగ్యవంతముగజేసి సౌందర్యము గాపాడును.

గరకు చర్మము కూడ మాయును. ప్రతిరాత్రి పాండ్స్ కోల్డుక్రీము వెంటపాండ్స్ వానిషింగ్ క్రీము ముఖమునకు, మెడకు, చేతులకుపూసిన మరుదినముదయమున చర్మము మృదువుగా మనోహరముగ నుండును.

ఉచితము: దీనిని నేడే పంపి పాండ్సు రెండు క్రీముల ట్యూబులను పాండ్సు ఫేసుపౌడరు మాదిరులను ఉచితముగా బడయుడు. (చెక్ షేడు) నేచురల్ ......రోజ్ క్రీమ్.........బ్రునెట్ ......

డాడ్జీ అండ్ సెయ్‌మర్ లిమిటెడ్,
3, విటెట్ రోడ్డు, బొంబాయి.

పేరు.......................................
చిరునామా...................No. 16 L. G.

Registered No. 1983



TRADE MARK

సకల పరీక్షలకు చెడకుండు సాక్షాత్ వజ్రమునకు సరి సమాన పూతగల

ఒరిజినల్

## కల్చర్ వజ్రములు

తోడుసైజు కమలం 1-కి 8 అణాలు.
బేసరిసైజు కమలం 1-కి 6 అణాలు.

కల్చర్ వజ్రములు మావద్ద దొరుకును.
గ్యారంటీ నగలున్ను దొరుకును.

S. అరుణాచలం శెట్టి,
M. రామస్వామి శెట్టి,
వరాపువ్యాపారం, పెద్దబజారు, తిరుచినాపల్లి.

## సయింటిఫిక్ బంగారు ఆభరణములు

హైకోర్టుజడ్జీలు, ప్రభుత్వమంత్రులు, కాంగ్రెసు ప్రెసిడెంట్లు, శాసనసభ్యులు మొదలగు గొప్పవారిచే ప్రశంసింపబడి, ఈ కంపెనీ గవర్నమెంటులో రిజిస్టరు చేయబడినది. పూర్తి కేటలాగు ఉచితము.




ది సైంటిఫిక్
గోల్డుబాంగిల్సు కంపెనీ లిమిటెడ్
191, చైనాబజారు రోడ్డు, మద్రాసు.

# అల్లిక పనులు

ఎల్. వి. నరసింహయ్యగారు



Cross Stitches (క్రాస్ కుట్లు)

ఈ కుట్టుకు ఒక కాన్వాస్ తుండు ఉపయోగింప నగును. ఒకటి లేక రెండు పోగులపై కుట్టువేయుచు రావలయును. పిదప ఒక్కొక్క కాన్వాస్ దారమును



లాగి వేయవలయును. పోగును తీసినతోడనే మీరు మొదట కుట్టినదారము వదలిచ్చిపోవును. అప్పుడు మిక్కిలి జాగ్రత్తగా వ్రాసియున్న దానియందు కుట్లను వేసుకొనిరావలయును. ఈ కుట్లను సూదినిచాచి గ్రుచ్చ వలయును. ఏవిధమైన దారమైనను ఉపయోగించ వచ్చును. కాని దానికి మాత్రము సరిఅయిన గుడ్డను



ఉపయోగించవలయును. మీరు ఏవిధమైన రంగు దారముసైనను కుట్టవచ్చును. చూచుటకు అందముగ నుండును.



Applique Works (అప్లిక్వ్యా పనులు)

అప్లిక్వ్యా అను కుట్టు మీరు శ్రద్ధగా చేయుచో మిక్కిలి అందముగనుండును. సర్జ్, లినన్,

కిరాస్ గుడ్డను వెనుకప్రక్క గుడ్డగా ఉపయోగించవచ్చును. ట్రాన్స్‌ఫర్ పనులు చేయవలసియుండిన ఆయా రంగులపై చేసికొనవచ్చును. ఒక్కొక్క రంగు వందును పువ్వుపు డిజైనులయొక్క అంచులను కత్తిరించునపుడు వాటియొక్క మొనలను గరుకులేక కత్తిరించవలయును. కంఠాభికుట్టు వేయుదలచుచో కుట్టెడి చిత్రమునకు సరియైన ముక్క కత్తిరించుకొని చుట్టును కుట్టవలయును. ఈ కుట్టును ఇంటియందలంకారార్థముపయోగించు గుడ్డలకేగాక, బిడ్డల గవునులు మొదలగు వాటికి ఉపయోగించవచ్చును.



Eyelet Works (ఐలెట్ పనులు)

పై పటమునందు కనబరచినటువంటి కుట్టు మిగుల విలువగల గుడ్డలయందు కుట్టినవైన మన జీవితకాలమంతయు నుపయోగింపవచ్చును. పై కనబరచినకుట్టుకు



తగిన రంగుదారము సేకరించుకొనవలయును. సాధారణమైనవూది ఉపయోగించవచ్చును. అయితే కుట్లన్నియు గట్టిగను కత్తిరించుభాగముయొక్క అంచున ఒకటితోనొకటి ఒత్తుగా చేరునట్లు కుట్టవలయును. ఎప్పుడును సూదిని ఎడమప్రక్క గ్రుచ్చి వెనుకప్రక్క తీవలయును. ట్రాన్స్‌ఫర్ చేయవలయునని కేవలము తేమచేసి దానిపైనుంచి యిస్త్రీపెట్టెలో యిస్త్రీచేసిన యెడల ఆ చిత్రమురీతి ప్రతిబింబము ఏర్పడును. పై కనబరచిన పటమును గుర్తించవలయును.



Richlien Works (రిచ్లీయన్ పనులు)

పై కనబరచిన కుట్టుపనిని మిగులజాగ్రత్తతో చేయవలయును. సాధారణపు తెల్లగుడ్డయందైనను, రంగు గుడ్డనందైనను, కావలసిన ఎట్టిరకములైనను సులభముగాకుట్టుకొనవచ్చును. వీనికి లినన్, ఫ్లానల్, ఎంబ్రాయిడరిదారము పెరిల్స్, ఎడిపో ఎంబ్రాయిడరి దారము ఉపయోగించవచ్చును. మొట్టమొదట మీరు డిజైనుయొక్క పైగీతయందు పైపైగనే రెండు వరుసగలకుట్టు వేయవలయును. దానికి బటన్‌హోల్ కుట్లను వేయవలయును. ఇది రెండువిధములు. దీనికి రిచ్లీన పనియనిచెప్పబడును. అయితే దీనికుట్టు బటన్ కుట్టురీతి గట్టిగానుండదు. దీనిలో సూదిని అనేకమార్లు క్రిందిపైపుగనే లాగి కుట్టవలయును. పువ్వుముయొక్క


FIG.1
1/4 INCH FOR HEM & UNDERLAY
CUT THREADS HERE TO START
CUT HERE WHERE THE DRAWN OUT THREADS MEET
LIFTING THREAD WITH NEEDLE


HEMS FOLDED ACROSS EACH OTHER AT CORNERS
FIG.2


THREAD DRAWN
MATERIAL FOLDED READY FOR PRESSING
FIG.3


CUT OFF SHADED PORTION
FOLD OF HEM
1/4 INCH FOR TURNING
FOLD OF HEM
FIG.4


FIG.5
HOW TO HOLD MATERIAL WHEN WORKING


HEM
FIG.6


HEM
"WRONG" SIDE
WIDTH EXAGGERATED FOR CLEARNESS
RIGHT SIDE
FIG.7

ఆకులకు మొనలకు సాటిన్ కుట్టునకు బటన్ హోల్ కుట్టురీతి మిక్కిలి జాగ్రత్తగా కుట్టవలయును. కుట్లను కత్తిరించరాదు.



Venetian Ladder Works
(వెనిషియన్ లాడర్ పనులు)

ఇది రెండువిధములు. మొట్టమొదట ఒకకుట్టును ద్వారమునకు సరిగా కుట్టవలయును. మరల దానిపై ననే మరియొకతూరి బిగువుగా కుట్టవలయును. పిదప



దానివిప్పి పై చెప్పినట్లు ద్వారమునకు ఐలట్ కుట్టు వేయవలయును. చిన్న పుష్పమైనను చిన్న పట్టుపురుగు అయినను వేయవలయుననిన సాటిన్ కుట్టును వేయవలయును. పటమును గుర్తింపుడు. వేసినదారములను గుడ్డనుండి తీయుటమొదట వికారముగా కనపడినను, దానిని సరియగుమార్గమున కుట్టిన పిదప మునుపటి దానికంటె చక్కగాకనబడును.

Hem Stitching (అంచు కుట్టు)

దీనిలో అంచుకుట్టు వేయునప్పుడు, కొనదారమును ఈడ్చివేయరాదు. ఏలనగా అనేకమార్లు ఈకుట్టు వేయునప్పుడు ఎచ్చుతక్కువలులేక వేయుటకు అసాధ్య మగును. మొదట అంచు వెడల్పును తీర్మానించుకొన వలయును. 1 అంగుళము అంచు గావలసివలసివచ్చి



నచో దీనితో $\frac{1}{4}$ అంగుళమును చేర్చుకొనవలయును. ఒకగుడ్డ నాలుగుప్రక్కల అంచు వేయవలయుననిన కావలసినదానికంటె $2\frac{1}{2}$ అంగుళముగుడ్డ అధికముగ ఎత్తుకొనవలయును.

D'Oyley or Mat (డి'ఆయ్లే లేక మేట్)

ఈకుట్టులకు $8\frac{1}{2}$ అంగుళము చదరముగల గుడ్డను తీసికొనవలయును. దారములను తీయవలసిన గుడ్డను మేజాపైపెట్టి $1\frac{1}{4}$ అంగుళమో లేక ఎంతకావలయునో అంత అంచునందుండి లోప్రక్కకు కొలువవలయును. అచ్చోట ఒకగుండుసూది గ్రుచ్చి రెండుప్రక్కల యందును దారమునువిడిచి దానిని సూదిచేతగాని లేక గుండుసూదిచేతగాని ఎత్తవలయును (పటము 1.) ఇప్పుడు దీనియెదుట కొనయందు కొలిచి మూలను తెంపివేసి రెండు ప్రక్కలయందుండి లాగవలయును (పటము 1.) రెండుదారములున్ను చేర్పుచోట మూలను యిచ్చును. ఒకటిపై నొకటి సంధించుచోట దారమును లాగి కోసివేయవలయును.

మడతగుడ్డను లోప్రక్క మడిచి అంచును వెనుక ప్రక్కగా కావలసినంత మడిచి దారమును ఎత్తినంత దరకు "టక్" వేయవలయును.

మొదట రెండు ఎదురుగనున్న ప్రక్కలయందు పనిచేయవలయును. దీనియందు పొట్టిదారములను చేర్చుకొనవలయును.

Corner Mitre (మూలలను మెటర్ చేసిన)- దీనిని మొదట ఒక కాగితమున అభ్యాసము చేసికొని

మూలఅంచులను ఒకటిపై నొకటి అమరునట్లు మడుచుకొనవలయును. (పటము 2) 3-వ పటమున చూపినట్లు గుడ్డబాగుగ మడిచి, మడువబడినచోటునందు గట్టిగ కుట్టవలయును. పిదప అంచులను విప్పి మడువబడిన మూలగుడ్డయందు ¼ అంగుళము విడిచి మిగిలినది కత్తిరించవలయును. (పటము 4) మరల మడిచి మధ్య కుట్టు ఉపయోగించవలయును. లేక అంచులను చేర్చి (fell) "ఫెల్" కుట్టువేయవలయును. సాధారణ అంచుకుట్టు-పటమునందువలె అంచును లోప్రక్కగా త్రిప్పి గుడ్డను పట్టుకొనవలయును.

సన్నని సూదిని లావైన ఊలుదారమును ఉపయోగించవలయును. వెనుకప్రక్క చుట్టుముకుట్టు వేయవలయును. సూదిని మడిచిన అంచుపైకితీసి వెనుకనున్న కుట్టువలన బిగించి సూదిని ఎడమప్రక్కగా దారముల తీసినచోట మూడువాల్గుదారములకు అడుగునపెట్టి (పటము 6) దానిద్వారా లాగి మడతయందుమాత్రము ఒకకుట్టువేసి సూదిని లోప్రక్కగా త్రిప్పివేయవలయును. (పటము 7) గట్టిగాలాగి నాలుప్రక్కలయందును ముగియువఱకు కుట్టవలయును. అంచులయొక్క మూలలయందు కావలసినట్లు ఒకటి లేక రెండు పైకుట్లు వేయవలయును.

అంత్యమున మడతయందు ఒకకుట్టు ఎక్కువగా వేసి మునుపటిఅంచు కొనయొక్క మూలమున దీసి పనిముగించినపిదప బయటిఅంచును చక్కగ కత్తిరింపవలయును.


అనుకరణములను చూచి మోసపోకుడు

అమృతాంజనము




"కేవలము గృహలక్ష్మి"

అన్నినొప్పులకు సిద్ధామృతము

అమృతాంజనం లిమిటెడ్

బొంబాయి — మదరాసు — కలకత్తా




## వింతయైన పూర్వజన్మస్మృతి:

ఈమధ్య 'సన్ డేస్టాండర్డు' పత్రికా కార్యాలయములో నొక పెద్దమనిషి తన యనుభవము నీ క్రింది విధముగ వివరించిచెప్పెను.

"నేను నడివయస్సు దాటినవాడను. నాకు జీవితములో నింత యాలస్యముగ సంభవించిన యొకానొక యనుభవమునుబట్టి నా పూర్వమతమును విడిచి క్రొత్తసిద్ధాంతములను, నమ్మకములను అవలంబించుట చిక్కాకుగనే కనిపించుచున్నది.

ఇప్పటివరకు పునర్జన్మసిద్ధాంత మెన్నడు నామనస్సు నాకర్షించలేదు. మతమునుగురించి నాకెప్పుడును స్థిరాభిప్రాయములుండెను. భవిష్యత్తునుగురించియు నా యభిప్రాయములంత స్థిరముగనేయుండెను. ఈ యకాలానుభవజనిత జ్ఞానముచే నాసర్వమును చలించిపోయినదనిన నతిశయోక్తి కాదు.

## నా తానుభవమేమన:

మీరు నమ్మడు నమ్మకపోండు, మీయిష్టము. కాని, యీసంఘటనముయొక్క తత్త్వమునందు నాకు నమ్మకము కలిగినది. నేను పొదుపరినిగనుక, కొంత పెద్ద మొత్తముగల ధనమును బ్యాంకులో నిలవజేసుకొంటిని. నాకు బంధువులుగాని, నామీద నాధారపడిన మరి యెవరునుగాని లేకపోవుటచేత నామరణశాసనము నెట్లు వ్రాసిన బాగుండునని యీమధ్య నామనస్సున కొంతచింత బయలుదేరెను. ఒకనాడు ఆ విషయమై చాలసేపు మనస్సున చింత చేసిచేసి తుదకు ఏనిర్ధారణకురాజాలక యట్లే నిద్రబోతిని. తెల్లవారితేవగానే నాబ్యాంకున కేగవలెనని నామనస్సునకట్లో తట్టినది. వెంటనేవెళ్ళి బ్యాంకు మేనేజరును చూడగోరితిని. మేమిద్దరమును మేనేజరు గదిలో ప్రవేశించి తలుపులుమూసికొని కూర్చొంటిమి. నేనెవ్వరైన నితరులున్నారేమో చూచుటకో యన్నట్లు నలుదిక్కులచూచి, మెల్లగా నిట్లంటిని.

"నేనింకెంతో కాలము బ్రతుకను. నాధనము పెద్దమొత్తము బ్యాంకులోనున్నదని మీ రెఱిగినసంగతియేగదా? ఆపైకమును దానధర్మములకు విడిచిపెట్టరాదని నిశ్చయించుకొన్నాను. అంతేకాక, ఆపైకమును నేనే పదిసంవత్సరములకో నూరేండ్లకో, యెప్పుడో యొకప్పుడువచ్చి యడిగి తీసుకొందును. మీ కార్యాలయమున కెవరువచ్చి యీపైక మిమ్మనియడిగిన వారికిచ్చునట్లుత్తరువు జేసియుంచుడు." ఈమాటలు నానోటినుంచి అప్రయత్నముగవచ్చెను. నిజముగ నాకప్పుడీ శరీరస్మారకము లేదు. నాకంఠస్వరము నాకెక్కడనుండియో వినబడినట్లాయెను.

నేను బ్యాంకు మేనేజరు ముఖముపైపుచూడగానే చట్టున స్మారకమువచ్చినది. ఆయనముఖము రక్తవిహీనమై తెల్లబడి, తీవ్రముగ వణకిపోవుచుండెను. ఆయన యొక్కమాటనైన నాడకుండ లేచి, యినుపపెట్టె

తెరచి దానిలో చాలకాలముండుటచే పచ్చబడిపోయిన యొకపత్రమును పైకితీసి నాకందించెను. ఎనుబదిసంవత్సరములక్రిందట నొక కాతాదారు అప్పటిమేనేజరు నిట్లే తనపైకమును ఆబ్యాంకులో, పదేండ్లకుగాని, నూఱేండ్లకుగాని, యెప్పుడో యొకప్పుడెవరైనావచ్చి యడిగి తీసికొనేవరకు నిలవయుంచమని యడిగినట్లందున్నది.

ఆపత్రములోని వ్రాతయు, నావ్రాతయు నొక్కపోలికనున్నవి. (దివ్యజ్ఞానదీపిక)

బడిపంతు లెందుకౌతారు ప్రారబ్ధంగాకపోతే?

ఉద్యోగములేకపోతే ఉపాధ్యాయత్వ మంటూవుంటారు చాలమంది. కాని అంతకంటె దురదృష్టవంతుడు ఇంకొకడుండడని అందరికీ తెలిసిందే. హిందూస్థాన్ టైమ్సులోని యీవార్త చూడండి. ఉపాధ్యాయుల అదృష్టం ఏలా వెలుగుతూవుందో.

ఝాన్సీ డిస్ట్రిక్టుబోర్డుకు చేరిన భట్టిగాన్ గ్రామములో ప్రాథమికపాఠశాల ఉపాధ్యాయు డొకడున్నాడు. అతనికంటె దురదృష్టజీవి ఎవడైనా వున్నాడంటే సందేహమే. అతనికి నెలజీతము పదిరూపాయలు. అతను బడిపెట్టుకునేచోటు యిరవైమందిపిల్లలకు సరిపోతుంది. కాని ఆబడికి 35 మంది పిల్లలు ప్రతిరోజూవస్తారు. పోనీ చోటులేదుబాబూ కొంతమంది బైటకూర్చోండి అంటే, అలాకూర్చోబెట్టిన వాళ్లతలిదండ్రులు దుడ్డుకర్రలతో తయారై, 'ఈమారు మాపిల్లలను అలాబైటకూర్చోబెడితే బడితెపూజచేస్తాం భద్ర'మంటూ బెదిరిస్తారు. ఇంకా ఆ వుపాధ్యాయుడు నిద్రపోకుండావుండే అన్నిగంటలూ పిల్లలకు చదువు చెప్పవలసిందే. వంటచేసుకోవడానికి కూడా ఆయన కాలం కర్చుచేయడం వూరివారి కిష్టములేదు. ఇదంతా ఈలావుండగా ఇపుడింకొక బాధవచ్చిపడింది అతనికి. 'ఓ' అంటే 'న'రాని కుర్రకుంకలను కొందరిని పై తరగతులలోనికి చేర్చుకోవాలి అలాచేయకపోతే విరగదంతామని వుపాధ్యాయుణ్ణి భయపెడుతున్నారట. పాపము బడిపంతులకష్టాలకు అంతుఅనేది వుండదేమో?

విచిత్రమైన మానవుడు.

హడ్జి అలి ఈజిప్టుదేశీయుడు. అతని శరీరాన్ని పరీక్షించేటందుకు అమెరికా రాక్ ఫెల్లర్ శాస్త్ర పరిశోధనాలయమువారు అతనిమృతి అనంతరము శవానికి ఐదులక్షలరూపాయ లిస్తామన్నారు.

అతనిలోవున్న విచిత్రమేమిటంటే అతను ఏవస్తువునైనా లోపలికి మ్రింగివేస్తాడు. అంతకంటే విచిత్రంగా ఎపుడుకావలిస్తే అపుడు, ఎన్నివస్తువులతినివున్నా, కావలసినవస్తువును సునాయాసంగా బైటికి తెప్పిస్తాడు. అతడింకో వింతప్రదర్శనంకూడా చేస్తాడు. మొదట ఏభైకప్పులనీళ్లు త్రాగుతాడు. తరువాత ఒకకప్పుపెట్రోలు త్రాగుతాడు. వీనిలో ఒకటితోఒకటి కలవనీకుండా ఏదికావలిస్తే అది నోటిలో పైకి తెప్పిస్తాడు. కావలిస్తే మొదట పెట్రోలును నిప్పుమీదవుమిసి అది మండుతూవున్నపుడు, అంతకుముందు త్రాగిననీళ్లను పైకితెప్పించి వుమిసి అగ్నిని ఆర్పుతాడు. విజ్ఞానశాస్త్రవేత్తలంతా గుమిగూడి పరీక్షించారు. కడుపును ఎక్సరేతీశారు, కాని వారికే విచిత్రమూకనపడలేదు. ఇదంతా ఏలాచేస్తావయ్యా అంటే 'నా కడుపు కండరాలమీద నా కంతశక్తివుంది. అవి నేను చెప్పినట్లంతా చేస్తాయి, నేను ఏడేళ్ళవాడ్నిగా వున్నప్పుడే నాలోనిశక్తిని కనుక్కొన్నాను. అపుడే బ్రతికినచేపలను మ్రింగి అవి చావకుండా బైటికితీసేవాణ్ణి' అని చెప్పాడు.



'కేసరికుటీరము'

రాయపేటనందలి నూతనభవనము



శ్రీమతి హామదానిగారు

'గృహశాస్త్రము' లందున్నత విద్యబడయుటకై ఇంగ్లండున కేగిరి.



శ్రీమతి విజయలక్ష్మీ కానుగగారు

బొంబాయి శాసనసభా సభ్యురాలు

# పుష్పచయము

## బాలబాలికల విద్యాభ్యాసము

విద్యావిధానమున ప్రాథమికావస్థయే అనేకకష్టములతో కూడుకొనియున్నట్టిది. ఇందు బాలబాలికలకొసగు శిక్షణము ఉత్తరోత్తరము వారిని ప్రయోజకులనో అప్రయోజకులనో చేయుగలదు. ఆందు వంగరాష్ట్రము ఎట్లు తోడ్పడుచున్నదో యీ క్రిందివార్తలు తెలుపగలవు.

కలకత్తాకార్పొరేషన్ వారి యధీనమునను్న 250 ప్రాథమికపాఠశాలందు జదువుచున్న 30,000 బీదవిద్యార్థులకు ఉచితముగా పుస్తకములు వగైరా కొనియియ్యవలెనని ఆకార్పొరేషన్ విద్యాధిపతి శిఫారస్సుచేయుచు దానికయి స్కీమొకటి తయారుచేయుచున్నాడు. కార్పొరేషన్ ఈస్కీము నంగీకరించునని రూఢిగా తెలియుచున్నది.

ప్రాథమిక పాఠశాలలలో నుచితముగా విద్యాబోధ చేయవలెనను సూత్రమెల్లర యంగీకారమును బడసియుండియు బీదవాదలకు తగుసౌకర్యము లభించుటలేదనియు, నింకమాధ్యమికము హైస్కూలు తరగతులలో బీదల దుఃస్థితి మరింత యెక్కుడనియు గ్రహించి శ్రీరవీంద్రుని యాదేశానుసారము విశ్వభారతి వారీ నిర్వ్యాపారమునునిర్మూలించుటకు బూనుకొన్నారు. గణితము, భూగోళము, రసాయనశాస్త్రము, దేశచరిత్రాది ముఖ్యవిషయములందు విద్యార్థుల కక్కడక్కడ పరీక్షలజరిపి "లోకశిక్షా సంసత్తు"ల నేర్పాటుచేసి వ్యర్థజీవనమును బోగొట్ట నిశ్చయించినారు.

*   *   *   *

## అంతర్జాతీయ విద్యాసమావేశమునకు భారతస్త్రీ ప్రతినిధి రాయబారము

భారతీయు లనగానే బ్రిటిష్‌వారి గ్రుడ్లెంత యెఱ్ఱనగునో క్రొత్తగాదు. సామ్రాజ్యవాదముతో విఱ్ఱవీగు బ్రిటిష్‌వారికిని మనకును పొత్తుకుదురదను మననాయకుల వచస్సు అర్థవంతమే. ఇట్లుగాక 'బ్రిటిష్‌వారు చాల సహృదయులు, భారతీయులమీద వారికెంతో యభిమానము' అనునట్టి కొందఱు ఛాందసు లీక్రింది "మాడర్న్ రివ్యూ"లోని వార్తనుజదివి సత్యముగ్రహించి యికనైన మేల్కొందురా?

టోకియో (జపాన్) లో నీమాసమునజరుగు అంతర్జాతీయవిద్యా సమావేశమునకు ప్రతినిధులుగా వెడలిన భారతీయ స్త్రీవర్గము మార్గమున చైనాదేశమును సందర్శించెను. 'హిందూదేశమిత్రుడు' అను పేర ఒక చైనావాస్తవ్యుడు హైన్‌స్టిన్ నుండి స్త్రీప్రతినిధుల కొందఱిగూర్చి యీక్రింది సమాచారము తెలుపుచున్నాడు. 'వీరు కొన్నివారములుగా చైనాలో అక్కడక్కడ విశేషముల తిలకించుచు అనేకజాతి

వారితో సంప్రదించుచు తమ భారతీయౌన్నత్యమును చక్కగా చాటినారు. ఈరాయబారములో నొక్కరు లైన్‌స్టిన్‌లో తమ అద్భుతమైన యుపన్యాసకౌశలమును విదేశీయులు, చైనాదేశీయులు-వీరి యెదుట ప్రదర్శించిరి. ఆయుపన్యాసము పూర్తిగా నెట్టివ్యాఖ్యానములును లేక చైనా, అమెరికను పత్రికలు అట్లే ప్రకటించినవి; కాని బ్రిటిష్‌పత్రిక ఉపన్యాసమును మరునాడు సంగ్రహించుటయే గాక విపరీతమును, కఠోరమునగు సంపాదకీయ వ్యాఖ్య పెక్కు అవకతవకలతో గావించినది. ఇందు హిందూదేశమునుగూర్చిన ఖండనము నైతేముకలదు. ఈ స్నేహితుడు కపాలి ఖండవాలకన్య యుపన్యాసమును పత్రికావ్యాఖ్యానమును మాకు పంపియున్నాడు. దీనిపై వ్యాఖ్యానము 'శుద్ధ అనవసరము.'

*    *    *    *

## వివాహసంస్కరణచట్టము

'పెండ్లియన్న నొక్కనాటితో ముగియునదిగాదు; యావజ్జీవభాగస్వామ్యము' అని నొకరు వచించిరి. వివాహవిషయమున యౌవనులకంటె వృద్ధులేయెక్కువ యాతురత చూపెట్టుచున్నారు. దీనికి అవ్యవహితఫలము బాలవితంతువు లెక్కువగుటయే. ఈ బాలవితంతువుల నుద్ధరించుటకు ప్రభుత్వము పూనుకొన్ననే వారిస్థితి కొంతకుకొంతయైన బాగుపడును. ఈ క్రిందివార్తను జూడుడు:

> వంగరాష్ట్రశాసనసభ్యుడొకడు వివాహసంస్కరణ విషయముగా నొక చిత్తుశాసనమును తయారుచేసి దానినిని ప్రవేశపెట్టుటకు నోటీసు ఇచ్చియున్నాడు. దీనిప్రకారము వివాహమగుటకు పూర్వము వరుడు తనకు ప్రమాదమగు చర్మ, అంటు, వ్యాధులెట్టివిగాని లేవని నిరూపించుచు ఒకవైద్యునెడ సర్టిఫికెట్టు పొందవలయును. ఇదిగాక యేబదిగాని దానికిపైబడిగాని వయస్సుగల వృద్ధుడు ఇరువదైదు సంవత్సరములకు తక్కువ వయస్సుగల యువతిని పెండ్లాడరాదు. వివాహసమయములందు నిర్బంధము ద్వారాగాని అన్యథాగాని కట్నములు పుచ్చుకొనుట అసలుకూడదని నిషేధముండును.

*    *    *    *

## పరంజిపాయ్‌గారి స్త్రీప్రశంస

ఒక 'ఫుట్‌బాల్' పందెములో వ్యాయామక్రీడామర్యాదకు భిన్నముగా మతావేశముతో ఆటకాండ్రు ఒకరినొకరు కొట్టుకొనిరని ఒక కలకత్తావార్త తెలుపుచున్నది. స్త్రీలలో నిట్టి విభేదము లసలులేదని పరంజప్యెగారు భారతీయస్త్రీ విశ్వవిద్యాలయము స్నాతకోపన్యాససందర్భమున నొసగిన నీ క్రిందివాక్యములు గమనింపదగినవి;

> "తన ప్రేరేపణవల్ల నితరుల దృక్పథము నేవిషయమందుగాని మార్చుటకు శక్తిసామర్థ్యము లుండవలెనన్న ముఖ్యముగా తాను రెండుభాషల నేర్చియుండవలెనని నా దృఢాభిప్రాయము.
>
> "దేశస్వాతంత్ర్యవిషయమున పురుషులకంటె స్త్రీలే సహజ సమరోత్సాహముల జూపినారు. స్వల్పసంఖ్యాకులయ్యు లోకసంగ్రహార్థము స్త్రీలు సాంఘికాభిమానము, సంకుచితదృష్టుల పడజాలరు. ఇట్టియున్నతాశయముల వీడకుందురని నానమ్మకము.

"పట్టభద్రలయినవారి కొకమాట. మీరు భార్యలుగనో తల్లులుగనో వర్తింపవలసియున్నారు. మీరు చదువుకొన్నవారు గనుక మీ భారము చక్కగా గుర్తింతురని తలతును."

*   *   *   *

## స్త్రీలకూ౦దు పురుషులోడినారు

'తలిరుఁబోడి, యబల' ఇత్యాదినామములతో స్త్రీలబిలిచి వారెందుకును పనికిరారను మూఢవిశ్వాసము పురుషులకు పెక్కురకుగలదు; కాని సరియగు నవకాశములున్నెడల పురుషులకు స్త్రీలేమాత్రము తీసిపోరు. దానిసీ క్రిందివృత్తాంతము స్పష్టపఱచగలదు.

> "100 పౌండ్ల విలువగల 'హాతోరస్డన్' బహుమతి యొకటిగలదు. ఇది ప్రతియేడును భావనాగర్భితమైన ఉత్తమకావ్యము వ్రాసినవారికి స్త్రీపురుషవివక్షలేక యొసగబడుచున్నది. ఈబహుమతిబడిసినవారు మిగుల విఖ్యాతిబడయుదురు. ఇది 1919 లో మిస్ ఆలిస్‌వార్ రెండర్‌గారిచే స్థాపింపబడినది. ఈసంవత్సరము రూథ్‌పిట్టర్‌కన్య తానువ్రాసిన "A Trophy of arms" అను కవితకు పై బహుమతి బడసినది.
>
> "విద్యాబోధనశాఖలోని వారువ్రాసిన యుత్తమకావ్యమునకు స్త్రీపురుషభేదములేక 1000 పౌండ్ల బహుమతినందవచ్చును. ఈసంవత్సరము మాంచెస్టర్ విద్యాశాలయుపాధ్యాయిని పురుషులందఱిని ఓడించినది. ఈమె తనవ్రాసిన "A Stranger and a sojourn" అను నవలకు నీ బహుమతినందినది. ఈపోటీ సుప్రసిద్ధ పబ్లిషర్లగు హోడ్డరు అండు స్టాంగర్‌టన్ వారిచే నడపబడుచున్నది.

*   *   *   *

## వధువ్రులకు బడులు

ఈవిషయము సుంతవిపరీతముగా గోచరింపవచ్చునుగాని జపాను మొదలగు దేశముల నిట్టిబడులు స్థాపింపబడుచున్నవి. దీనివల్ల దంపతులసౌఖ్యము వృద్ధిపొందునని నిర్వాతలయభిప్రాయము. ఒకచైనావార్త యిట్లుగలదు:

> "టోకియోలో నున్నవిధమున షాంగైలోగూడ వధువులకు బడులు స్థాపించవలెనని టోకియోవాసి టుకూకో ఒకాడా ప్రయత్నములు కొనసాగించుచున్నారు. ఈ బడిద్వారా "సుఖవివాహములు" జరుపుటకు యోచన.
>
> ఈ బడిలో ఉత్కృష్టమగు సాంసారికసౌఖ్యమును మితవ్యయముతో బొందు శాస్త్రమున తర్ఫీదొసగబడును. ఇంకను పుత్త్రోదయసమయమున కావలసినశ్రద్ధ, పాకశాస్త్రము, ఉడుపులు తయారుచేయుట, పుష్పాపచయము — వీనియందు ఆకన్యలకు శిక్షణ మొసగుదురు.

# ఆ రో గ్య వి జ్ఞా న ము

గర్భిణీస్త్రీలు నేరేడిపండ్లు తినకూడదు.

*   *   *

అటుకులుతింటే మలబద్ధము కడుపునొప్పి వచ్చును.

*   *   *

అడవిమాసపత్రియాకురసము బిడ్డల తలకుపూస్తే బాలబావ చిన్నెలురావు.

*   *   *

ఇంటిపెరటిలో అరటిచెట్టువుంటే సదా ఆరోగ్యము.

*   *   *

అరటిఆకులో భోజన మాయుర్వృద్ధి.

*   *   *

ఆగాకరకాయకూరతింటే కుష్ఠరోగము తగ్గుతుంది.

*   *   *

ఉన్మాదము, మూర్ఛ ఉన్నవారు ఆముదము పుచ్చుకోకూడదు.

*   *   *

ఆలుదుంపలు అజీర్ణము కలుగజేయును.

*   *   *

ఆవాలు ధూపమువేస్తే పిశాచబాధ తొలగుతుంది.

*   *   *

ఊయలలో ఊగితే బుద్ధి ప్రకాశిస్తుంది.

*   *   *

కమలాఫలము మెదడుకు హానిచేయును.

*   *   *

చింతచిగురు కండ్లకు జబ్బుచేస్తుంది.

*   *   *

కుష్ఠరోగము గలవారు చెరుకు తినకూడదు.

*   *   *

జీడిగింజలుతింటే స్త్రీలకు వంధ్యాత్వము కలుగుతుంది.

*   *   *

దంతధావనము కండ్లకు చలువచేయును.

*   *   *

తెలకపిండితింటే స్త్రీలకు పాలుపడతవి.

*   *   *

దొంతరగన్నేరుపువ్వులు ముడుచుకుంటే తలత్రిప్పు మొదలగు శిరోరోగములుపోతవి.

అడపా సుగుణమణి.

# గ్రంథపరిచయము

**మాలతీ మాధవము**

అనువాదకులు కైలాసవాసి జనమంచి వేంకటరామయ్యగారు. వీరు దీనిని అనువదించి సుమారు 35 సం. లైనది. కథ జగత్ప్రసిద్ధమైన భవభూతిది. అనువాదకులు శ్రమపుచ్చుకొని సాధ్యమైనంతవఱకు మూలమునందలి యౌచిత్యమునకు భంగము రాకుండ ప్రయత్నించియున్నారు.

'లీనేవ ప్రతిబింబితేవ లిఖితే వోత్కీర్ణరూపేవచ' అను మూలమునందలి శ్లోకమునకు 'వెలదుక లీనమాడ్కి ప్రతిబింబితభంగి......' అను పద్యము పంచమాంకము 10 వ పద్యమున చక్కగనే అనువదింపబడినది. కాని యిందు మూలమందలి సంస్కృతపదములే వాడబడినవి.

తృతీయాంకమున 17వ పద్యమగు 'తగులుకొని తెగి......మతిదారుణమే' అను కందమునకు మూలమగు శ్లోకమిది. 'సంసక్త త్రుటితవివర్తి తాంత్రజాల వాకర్ద స్ఫురదపవృత్తరూఢఖండీః। కీలాల వ్యతికర గుల్ఫదఘ్నపంకః ప్రాచండ్యం వహతి నఖాయుధవ్య మార్గః''. ఇది రసస్థితికి దగిన శబ్దజాలముతో కూడియుండ అనువాదమునందలి పద్యమునం దట్టిదేమియు లేదు. దాని సరళగమనము రసోచితముగా లేదు.

ద్వితీయాంకమునందు మొదటిపద్యమగు ఉత్సాహమాలికకూడ నిట్టిదే. పద్యము చెప్పుటకు ముందు మాలతి కంట తడిపెట్టినది. వెంటనే చదువవలసి యున్న యుత్సాహమాలిక రసభంగము కలిగించుచున్నది.

అనువాదము సులభసాధ్యముగాదని యెఱిగితిమేని యిట్టి స్ఖాలిత్యములు లేకుండనుండవు. భవభూతి రచనామాధుర్యము చవిజూపుటకై యీ గ్రంథమును కళాశాల పాఠ్యపుస్తకముగా ఆంధ్రవిశ్వకళాపరిషత్తువా రంగీకరించియున్నారు. వెల 1-4-0. ప్రతులకు జనమంచివారు, రాజమండ్రి వ్రాయగలరు. [చ. రా.]

**నాగకన్య**

ఇది సోడ్డలి మహాకవిచే సంస్కృతమున ఉదయసుందరి అను పేర చంపుగా వ్రాయబడిన గ్రంథమున కనువాదము. దీనిని చంపువనుటకంటె వచనగ్రంథమనుట మేలు. అనువాదకులు వంగల వేంకటరామశాస్త్రిగారు. వీరు గ్రంథము నున్న దున్నట్లు అనువదించక కొన్నిచోట్ల సంక్షిప్తపరచియున్నారు. అనువాదము రసోచితముగనున్నది. జటిలదీర్ఘపదసమాసములనుకూడ జాను తెనుగున ఆంధ్రీకరించియున్నారు. (పుట 65, రెండవ పేరా.)

వీరు గ్రంథారంభమునందును అంతమునందునుగల సోడ్డలకవి స్వవిషయమునంతయు విడచి కథను మాత్రము వ్రాసిరి. దీర్ఘములైన వర్ణనలను విడుచుట నవీనులకు రుచించునేమో కాని యిందలి ప్రథమాధ్యాయమున 18 వ పుటయందు (మూలమునందు ద్వితీయాశ్వాసమునగల) నాటి జానపదుల జీవితవిశేషములనన్నింటిని క్లుప్తపరచి యనువదించుటచేత నాటి సాంఘికావస్థ తెలియుటకు వీలులేకపోయినది. ఇట్టి వర్ణన లనువాదములందు చేర్పకుండుట లోపమే యగును. వెల ముప్పావలా. ప్రతులకు గ్రంథకర్త, తాడికొండ, గుంటూరుజిల్లా. [చ. రా.]

* * *

**కాపుబిడ్డ**

ఇందు కర్షకుని జీవితము వివరముగ వర్ణింపబడినది. దుర్భరదారిద్ర్య దవానలపీడితులైన కర్షకజనాళికి భారతదేశము నేడు పుట్టినిల్లైనది. గ్రంథకర్త స్వయముగ కర్షకుడైనందున తమజీవితమును ప్రదర్శించుటలో నెక్కువ సామర్థ్యము చూపినా డనక తప్పదు. కాని కవిత్వదృష్టితో చూచిన నీగ్రంథమున చెప్పదగిన దేమియు లేదు. రచనలో వాడుకభాష

పెక్కువగ నుపయోగించువటుల కనపడుచున్నది. రచయిత గంగుల శాయిరెడ్డిగారు (జీడికల్లు, జనగామ తా. నల్లగొండజిల్లా.) గ్రంథము వెల 0-2-0. [చ. రా.]

* * *

ప్రత్యూషము — గ్రంథకర్త కొమరవోలు వేంకట సుబ్బారావుగారు, బి. ఏ. కాకినాడ ముద్రాక్షర శాలయందు ముద్రితము, వెల రూ. 1—0—0

"సర్వథా నిర్దుష్టమును రసవంతమును నయిన యీ కావ్యమును నూతనమార్గముల కవి నిర్మించినారు." "ప్రాచీనపద్ధతులలోని మంచినెల్లయెంచి యర్వాచీన వాఙ్మయములందలి మెఱుగుల" నిందు పూర్తిగా చొప్పించినారు. ఈ ప్రత్యూషమున అసలుకథకు అంతరార్థము సైతము కల్పించియు కుంటువడని ధారతో కవిత యల్లినారు. ఇది చదువునపుడు పఠితలదేహము పులకించుట సహజమే. ఏలన ఇందలికవిత యట్టిది. ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు దీనిని బి. ఏ. పరీక్షకు పఠనీయగ్రంథముగా నిర్ణయించుటయందే దీనిమహత్త్వము బోధపడగలదు. [గ. ప.]

* * *

ఆంధ్రతేజము — గ్రంథకర్త ఉభయభాషాప్రవీణ బోడేపూడి వేంకటరావుగారు, క్రౌన్ 1/16 సైజు 57 పుటలు. వెల నాల్గణాలు.

ఇందలికథ తల్లికోటయుద్ధమున రామరాయలు ఆదిల్‌సాహాపన్నిన కుట్రకారణముగా ఓడుట. ఈకథ నాలుగుప్రకరణములుగా విభజింపబడినది. మొదటి ప్రకరణమున కదనభూమినుండి తిరిగిన యొక యువకవీరునిజూచి అతని ప్రేయసి "...నగుదువో? యేద్దునో? తెరువు నాకేది ప్రాణము లుజ్జగించుటో" యని విసిగి ప్రశ్నింప బుద్ధితెచ్చుకొని యావీరుడు తిరుగా యుద్ధరంగమునకు వెడలుట. రెండవప్రకరణమున విద్యానగరవైభవము వర్ణితము. మూడవదానిలో తల్లికోటయుద్ధరంగమున రామరాయనిమరణము. ఈ ప్రకరణమున కవి సర్వత్ర ప్రత్యక్షమవుచున్నాడు. రామరాయని మరణానంతరము యుద్ధరంగములోని సేనలకొక యల్పవయస్కుడగు వీరుడు చేయు ప్రబోధము అత్యద్భుతముగా నున్నది. నిజముగా తెలుగువాడైన నీపట్టున రక్తముడుకకపోదు. "ఈ తెల్గని లోననే జనించెనుసుమీ నాడెమా వీరరత్నంబులెన్నో; కనిపెంచనే తల్లి ఖండితాహిత శిరస్తబకుడై పేర్గన్న శాతవాహు—కత్తులంబూని శాత్రవుల కావరముం డిగద్రావనెంచి రూపెత్తిన క్షాత్రధర్మమున చేపునం బోటున రేగుదెంచి లోకోత్తరశౌర్యముకా నెఱపనోపక పాఱెదరేల... దేశమాత దాస్యపాశంబులోం జిక్కి నన్వయమునం గీర్తియంతరింపం బాఱంజూచి యిట్లు బ్రతుకనెంచుటకంటె సిగ్గుగలద వేర సిగ్గు లేద..." ఇట్టి వెన్నియేనిం జూపవచ్చును. నాల్గవ ప్రకరణము వర్ణనమెట్టి కఠినునైన కరగించునట్లున్నది. "పండెను బండెమామకము ప్రాక్తన పుణ్యఫలంబు నేటికిన్ గండరగండడైన మొనగాని మనోహరుంగా వరించి..." యనుచు ప్రేమలతయను వీరపత్ని యగ్నిసుతికు ఘట్టమెంతో చక్కగను సుందరముగను ఉన్నది. కావ్యము చిన్నదయ్యును తన యసమానభావనను కవి యెల్లచోటం బ్రదర్శించినాడు. కవితాధార మధురముగా నున్నది. ఆంధ్రజనులు దీని నచిరకాలములోనే చక్కగా నాదరించి యిట్టి కావ్యములు పెక్కులు వ్రాయుటకు కవికి తోడ్పడుదురుగాక. [గ. ప.]

* * *

శ్రుతమధూళిక — గ్రంథకర్త మానూరు వేంకట శేషగిరిరావుగారు బి. ఎ. చల్లపల్లి (ప్రథమసంపుటము) (కృష్ణా) వెలలేదు.

గ్రంథనామము సరిగా అర్థమగుటలేదు. బహుశః ముఖపత్రముననున్న చిత్రము గ్రంథనామార్థమును సూచించునని కవిహృదయమేమో! యదియు సుస్పష్టముగాలేదు.

గ్రంథములోని 'కవిత' యేకట్టుబాట్లకుగాని లోబడినట్లు కన్పట్టదు. కవితాభాషయా, వ్యావహారికము గాని గ్రాంథికము గాని గాక పరమకృతకభాషయై యున్నది.

వ్యాకరణ చ్ఛందోవిషయముల స్వాతంత్ర్యము కావలయునని వాదించినను ఈగ్రంథములోనిది హద్దుపద్దులేక యెట్టివానికయిన విసుగొనరించుచున్నది. గ్రంథకర్త ఇట్టిపథములమాని నలుగురకుప

యోగించుపద్ధతినిఁ వ్రాయ మొదలిడిన నిక్కువముగా భాషాసేవకు తోడ్పడుదురు. [గ. ప.]

* * *

**మహాభారత కౌరవరంగము**

గ్రంథకర్తలు ఉమర్ అలీషా కవిసత్తములు.

కథావస్తు వెల్లరకును దెలిసినదేయైనను తమ కవితా చాతుర్యముచే చదువరుల హృదయముల తద్రచయిత చూరగొనెననుట యత్యుక్తి కాదు. పద్యములు నవరస భరితములై యుద్రేకపూరితములై భారతమునందలి నుడికారమునే నుంకమడుగుచున్నవి. ఇందలి పాత్ర పోషణముగూడ కడుంగడు జాగరూకతతోఁ జేయఁబడినది. ఇందు శ్రీకృష్ణుఁ డొక్కరుండును గర్ణుడొక్కరుండు నతిమానుషులై యొప్పుచుండిరి. అందు ముఖ్యముగా కర్ణుని లోకోత్తరగుణములు బహువిధముల నావిష్కృతములాయెను. భారతకర్తలే యాపాత్ర నతిచమత్కృతితో సృష్టించి కర్ణుఁడులేని భారతమా యను ప్రథనొనరించిరి. చూడుడు "నీవు కుంతీపుత్రుండవే సుమా" యని కృష్ణునిచేఁ జెప్పంబడి కర్ణుం డెట్టుల తన సహజధైర్యమును వెలిబుచ్చెనో

ఉ. కుంతికిఁ బుట్టినన్ మరి క
కుంతకుబుట్టిన బుట్ట నిమ్మసే
యింతికొ మానవుండుజని
యించుట తథ్యము నాకు దానికై
వంత యొకింతలేదు బల
వంతముగానిది తల్లియంచు నీ
వింతగఁ జెప్పనేల పెర
యింతులు తల్లులగారె మాధవా!

ఈపరి, పరకాంతన్ జననీ సమానమని చే భావింతునని ఘంటాపథంబుగ కర్ణుని పల్కించి వారీ నాటకకర్తలు. పరాత్మజానాం పితృతా కథంధ చేత్తని దుర్యోధనాదులచే వాదప్రతివాదనలఁ జేయించిరి.

కథ నింత ప్రౌఢముగ నొనరించినను కథావస్తువును సరిగ నతికలేకపోయి రేలొకొ బోధపడుట లేదు. కథ తీర్థమునకు తీర్థము, ప్రసాదమునకు ప్రసాదముగనున్న యది. భరతవాక్య మేమియు లేకున్నను, భరతవాక్యముతో పాత్తమును ముగించిరి. కర్ణమహారాజు నా స్థానకవియగు బాపని కాలమునకు తగినట్టుల చిత్రించియున్నారీ కవిగారు. మొత్తముమీద ఆలీషా కవిగారి కవితాధార యనర్గళమై గుఱ్ఱపు డెక్కలవలె తటపటాయించుననుట స్తుతివచనము కాఁజాలదు. [బు. వే. నా.]

# పత్రికాపరిచయము

**గర్జన**

శ్రీయుత జి. టి. నరసింహాచారిగారి సంపాదకత్వమున 163, గోవిందప్పనాయకన వీధి, జార్జిటౌను, మదరాసునుండి వెలువడు మాసపత్రిక. మొదటిసంచిక మా కందినది.

'క్రొత్తపత్రిక లింకా అవసరమే. అయితే దేశసేవ, భాషాసేవ ప్రధానలక్ష్యములుగ నుంచుకొనవలెను. విమర్శించుటయందు ఆక్రోశములేక న్యాయదృష్టితో ఒకరి దయాదాక్షిణ్యములు చూడక నిక్కచ్చిగ నున్నదున్నట్లుగ బ్రద్దలుకొట్టుటయే మా పత్రికయొక్క ప్రధానాశయము.' ఇది సంపాదకుల ఆశయము. 'రెండుజ్యోతుల కలయిక', 'ఆంధ్రదేశపు టపాకాయలు', 'సర్. కె. వి. రెడ్డిగారి ప్రతిభ', 'పరభాషలు—మన బుద్ధివికాసము' మొదలగు వ్యాసములు ఈ ఆశయమును కొంతవఱకు నెరవేర్పుచున్నవి. కాని 'గ్రహములు', 'మంచుకొండలు' ఆశయాలకు చాలదూరమునగలవు. 'ఆమె లంజయా?', 'అభినవరామాయణము', 'గుర్రయ్యగారి రైలుప్రయాణము' సంపాదకుల ఆశయాలను నెరవేర్పకపోగా అసభ్యముగ అసహ్యముగనున్న వనవచ్చును. కేవలము పచ్చిబూతులచే జనసామాన్యను నాకర్షింపవలయుననెడిదృష్టిని వీడి వారి యాశయముల కనుగుణమగు వ్యాసముల ప్రకటించుట యుత్తమమగును. దీనికి సంవత్సరముచందా 1-0-0 విడిప్రతి 0-1-6

# సంపాదకీయములు

కార్యాలయము మార్పు

ఇంతవఱకు గృహలక్ష్మికార్యాలయము ఎగ్మూరునందలి కేసరికుటీరమునందుండుట పాఠకసోదర సోదరీమణుల కెల్లరికిని విదితమే. ఇది ఈనెలారంభమునుండియు రాయపేటయందు నూతనముగా నిర్మింపబడిన 'కేసరికుటీరము'నకు గృహలక్ష్మి కార్యాలయము మార్చబడుచున్నది. ఉత్తర ప్రత్యుత్తరముల వ్రాయునపుడెల్ల చిరునామానందఱు గమనింపప్రార్థితులు.

15, వెస్ట్‌కాట్ రోడ్, రాయపేట,
మదరాసు.

శారదాబిల్లుకు సవాకారము

హిందూసంఘమునకు కళంకప్రాయమై, జాతిపతనమునకు హేతుభూతమైన అతిబాల్యవివాహ పిశాచమునకు మారణహోమము దలపెట్టి బైలుదేరినది శారదాబిల్లు. కాని ఇటువంటి శాసనములే మతమునకు కళంకప్రాయమని సనాతనులు దలంచిరి. వారీశాసనము తమ శాపనార్థాలు దప్పించుకొని బ్రదుకదని దలంచిరికాని శాసనమై అధికారబలముతో మీదికివచ్చిన తరువాత దానివాతనుండితప్పించుకొనుటకై తమ విజ్ఞానమునంతయు నుపయోగించిరి. అపుడు వారికొకమార్గము గోచరించినది.

భారతదేశమునగల విదేశీయుల మండలములందు బ్రిటీషు ఇండియాకువర్తించు శాసనములేమియు వర్తింపవు. అందుచే శారదాబిల్లు బారిబడక తమ మతముప్రకారము బాల్యవివాహము లాచరింప సనాతనులు, ఫ్రెంచివారివగు యానాం పుదుచ్చేరివంటి స్థలములకు లేక స్వదేశ సంస్థానములకు వెళ్లెడువారు. వివాహములు జరపుకొన్న తదుపరి తిరిగివచ్చి శారదాశాసనమును వెన్నుదన్ని తమ సంప్రదాయముల నిలుపుకొంటిమిగదాయని విఱ్ఱవీగెడివారు. ఇకపై వీరట్లు చేయుటకు వీలుండదు. ఇటీవలనే ఫ్రాన్సునందలి ప్రభుత్వమువారు ఫ్రెంచి ఇండియాభాగములలో నెచటనైనను బాల్యవివాహము లాచరింపరాదనియు వివాహములకు కనీసపువయస్సు బాలురకు 16 సంవత్సరములును, బాలికలకు 14 సంవత్సరములు నుండవలెననియు, దీనికి వ్యతిరేకముగాజరుగు వివాహములందు పాల్గొన్న, తలిదండ్రులకు, బంధువులకు, ఉద్యోగులకు, పురోహితులకు తగినదండన విధింపబడుననియు చట్టము గావించినటుల దెలియుచున్నది. కాబట్టి యికమీద శారదాశాసన మతిక్రమింప నీప్రాంతముల జేరువారి కుపయోగము గలుగదు. సనాతనులకీ నూతనకష్టము గలిగినందుకు సానుభూతి చూపవలయునో, చట్టములమూలమున మన సాంఘిక వ్యవహారముల చక్కబెట్టుకొనవచ్చినందుకు సిగ్గిలవలయునో సహృదయు లాలోచించెదరుగాక.

శారదాశాసనమం దింకను లోపములు గలవు. అందుచేతనే నిర్భయముగ నింకను అచ్చటచ్చట బాల్యవివాహములు జరుగుచున్నవి. కాంగ్రెసు మంత్రివర్గమువారు

ముఖ్యముగ నూతనశాసనసభ్యు రాంధ్రు-లోపములనెల్ల సవరించి యుపయోగమగు చట్టముగ జేయుదురుగాక. సామంతరాజ్యములుకూడ నిట్టి నిర్బంధనములను సమలునందుంచ ప్రయత్నింపకుండుట శోచనీయము.

స్త్రీ హితైషిణీమండలి బాపట్ల

పై మండలి యారవవార్షికసమావేశ మింటీవలనే జరిగినది. ఆసమయమున నధ్యక్షతవహించిన శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారియుపన్యాసము స్థలాంతరమున గాననగును. ఆరవవార్షిక నివేదికను చదివిన వారికి రెండువిషయములు స్పష్టమగుచున్నవి. దేశమునందలి అవిద్యాభావమును ప్రోదోలి స్త్రీలలో విద్య నెడ మక్కువయు, 'దేశపరిస్థితుల దెలిసికొని యందుత్సాహముతో పాల్గొను నిష్టమును, బాలికలమానసికాభివృద్ధియేగాక ఆరోగ్యాభ్యుదయమును గలిగింప యీమండలి యెక్కుడుగ పాటుపడుచుండుట మొదటిది. రెండవది మండలిపై వారియందెంత యక్కరజూపుచున్నదో, మండలి యభివృద్ధికితగిన ప్రోత్సాహ మిత రులు చూపకుండుట. అనవసరమని తమకు దెలిసియే ఎంతయోమంది కర్చు చేయుచుందురు. సత్కార్యములమాసించి పాటుపడు నిట్టి సంఘములు ఆర్థికసాహాయ్యములేదని మొఱపెట్టుచుండ సహృదయులు విని సహింపరని మాఆశయము. ఆర్థికసాహాయ్య మిటులుండియు నింతటిపట్టుదలతో నెంతయు సేవ చేయుచున్న యీమండలి నిర్వాహకవర్గము ప్రశంసాపాత్రము.

అండమాను ఖైదీల నిరశనదీక్ష.

అండమానులందు నిరశనవ్రతులగు ఖైదీలస్థితి నానాటికి ఘోరమగుచున్నదని వార్తలు వచ్చుచున్నవి. వీరి స్థితిని బాగు చేయునంతవఱకు తాముగూడ వారి ననుసరింతుమని బెంగాలునందు రాజకీయ నిర్బంధితులుగా నెంచబడి ప్రత్యేక ప్రదేశములం దుంచబడినవారుకూడ నిరశనదీక్షను సాగించుచున్నారు. ఇట్లే 500 మంది నిర్బంధితుల నిరశనదీక్ష భారతదేశమునంతయు నుడికించుచున్నది. కాని వీరి మొఱాలకించి వారు గోరిన సదుపాయములు గలిగింప సమర్థులగు బెంగాలురాష్ట్ర ప్రభుత్వము వారును, అఖిలభారతప్రభుత్వమువారును, ప్రజల ప్రార్థనల పెడచెవినిడి యూరకున్నారు. రాజకీయఖైదీలవిషయము మాకు సంబంధించినది గాదు; కేంద్రప్రభుత్వమువారిది; వారి యుత్తరువులేక మేమేమీ చేయజాలమని బెంగాలురాష్ట్రప్రభుత్వ మనుచున్నది. ఖైదీలు నిరశనవ్రతము మానునంతవఱకు వారి కోరికల గమనింపమని కేంద్రప్రభుత్వము భీష్మించరించినది. మా కోర్కెలను దీర్చినగాని నిరశనవ్రతము మానమని ఖైదీలు పట్టుబట్టి ప్రాణముల మీదికి తెచ్చుకొనుచున్నారు.

ఈప్రతిష్ఠంభమును చూచి దేశమంతయు సమితవిచారముతోనున్నది. ప్రభుత్వవైఖరిని ఖండించుచుయు సమ్మతిని వెల్లడించినది. ప్రజాశాంతిసౌఖ్యములకు భంగము గలుగుననికదా కొందరిని రాజకీయఖైదీలుగా

బెంగాలునందు నిర్బంధించి, మఱికొందరిని అండమానుద్వీపముల కంపిరి! ఎవరి శాంతి సౌఖ్యములను గోరిరో, ఆప్రజలే—ఆబాల గోపాలము ఆరాజకీయనిర్బంధితుల నందఱిని విడువవలసినదని యేకకంఠముతో మొఱ పెట్టుచుండ ప్రభుత్వమువారు వారిని విడుచుటకు వెనుకాడ నేల? తుదకు వారి ప్రార్థనల ననుసరించి నిర్బంధితుల మన్నలను విచారించుటకైనను తిరస్కరించు టేల?

వార్ధాయందు సమావేశమైన కాంగ్రెసు వర్కింగ్ కమిటీ నిరశనవ్రతుల దీక్షనుండి విరమించుకొమ్మని వారికి సందేశ మంపుటకై తీర్మానించినది. వా రనినట్లు నిరశనవ్రతుల యాశయములన్నియు అఖిలభారతీయుల హృదయములందు నాటుకొన్నవి. కావున వారింక దీక్షకు విశ్రాంతి యొసంగ నగును. ప్రజలమతముననుసరించి ప్రభుత్వమువారును ఖైదీల మన్ననల నంగీకరించి వారి యభ్యుదయమునకై ప్రయత్నింతురు గాక.

### విద్యకు తగినకాలము

శ్రీయుత ఆచంట లక్ష్మీపతిగారు ఆరోగ్యశాఖా మంత్రిగారికి పాఠశాలలో చదువు చెప్పవలసిన కాలమునుగూర్చి యొక యుత్తరము వ్రాసియుండిరి. ప్రకృతము పాఠశాలలందు చదువు చెప్పబడు కాలము ఉదయమునను సాయంతనమునను తగినదికాదనియు, భోజనానంతరము విద్యాభ్యాసమునకు తగియుండుట లేదనియు, దీని గమనింపనందువలననే విద్యార్థులలో చాల మంది యనారోగ్యమునకు పాల్పడుచున్నారనియు, దీనినిమార్చి ఉదయము 6 గంటల నుండి 11 గంటలలోపలనే నాలుగు గంటలు మాత్రము విద్యాభ్యసన కాలముగా పెట్టుకొనవలయుననియు దాని సారాంశము.

నేటి విద్యావిధానమువలన (వృత్తివిద్యలను దప్పించి) స్త్రీపురుషుల కెవరికిగాని యుపయోగములేదన్నచో నది చర్వితచర్వణము. ఈ నిరుపయోగమైన విద్యావిధానము విద్యార్థుల యారోగ్యమునకు భంగము గలుగునట్టిదైనచో నిక జెప్పవలసిన దేమియునుండదు. నేటి కాంగ్రెసు మంత్రివర్గ మీ విధానమును బాగుచేయుననియే నమ్మెదము. దీనితోపాటు శ్రీ లక్ష్మీపతిగారు సూచించినరీతి విద్యాభ్యాసకాలము ఉదయమునందే యుండునట్లు నియమించి యారోగ్యశాఖ మంత్రిగారు తగిన యేర్పాట్లను చేయుదురుగాక. ఇదివఱకే తిరువాంకూరురాష్ట్రము ఈవిధాన మవలంబించి మార్గదర్శకమైనది. దీనితో విద్యార్థుల యారోగ్యమైనను చక్కగనుండి వారు గడించు విద్యకంటె యమూల్యమై వారి జీవితములందు సహాయపడగలదు. అంతియగాక డాక్టరుగారు సూచించినరీతి వయసున నున్న విద్యార్థులు విద్యార్థిదశయందుండియు, వారి తలిదండ్రులకు వృత్తులందో, గృహకృత్యములందో తోడ్పడగలరు. బీదవారగు విద్యార్థులు తగిన ధనము గడించి తమ విద్యాభ్యాసము కొనసాగించుటకు అనుకూలముగనుండును.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# ఈశ్వర సం॥ర శ్రావణ భాద్రపదములు

1937 సం॥ సెప్టెంబరు నెల

| | |
|---|---|
| 1 | ఏ॥ బు ఉ9-50 పునరా8-46 వఉ9-26 మొ10-57కు వతె4-26 మొ భో°6-50 |
| 2 | ద్వా॥ గు ఉ7-52 పుష్యరా7-43 శేవఉ5-58కు భో°6-46 |
| 3 | త్ర॥ శు ఉ6-0 చతు తె 4-35 ఆశ్లేసా6-36 వఉ7-36 మొ9-27కు భో°6-42 |
| 4 | అమా॥ ● శ తె3-45 మఘసా6-27 వఉ6-37 మొ8-12కు వరా3-4 మొ4-41కు భో°6-38 |
| 5 | శు॥ పా ఆ తె3-20 పుబ్బసా6-34 వరా2-24 మొ4-2కు |
| 6 | వి॥ సో తె3-32 ఉత్తరరా7-13 వతె4-35 మొ భో°6-30 |
| 7 | త॥ మం తె4-7 హరా8-30 శేవ5-54 వతె5-26 మొ భో°6-26 |
| 8 | చ॥ బు తె5-17 చిత్తరా9-55 శేవఉ7-8 కువతె4-25 మొభో°6-32 వినాయకచతుర్థి |
| 9 | పం॥ గు పూర్తిస్వారా11-55 శేవఉ6-9కు భో°6-18 |
| 10 | పం॥ శు ఉ6-51 విశారా2-17 వఉ6-4 మొ7-50 భో°6-14 |
| 11 | ష॥ శ ఉ8-52 అనూరా4-51 వఉ6-43 మొ8-29కు భో°6-10 |
| 12 | స॥ ఆ ఉ11-0జ్యేపూర్తివప11-19 మొ1-5కు భో°6-6 |
| 13 | అ॥ సో ప1-4 జ్యేఉ7-43వసా4-33మొ6-9కు భో°6-2 నవమీతిథి |
| 14 | న॥ మం ప2-58మూఉ10-13వఉ8-27 మొ10-13కు వరా8-39 మొ10-24కుభో°5-58కూ॥త |
| 15 | ద॥ బు సా4-34 పూషాప12-26 వరా9-0 మొ10-43కు భో°5-54 |
| 16 | ఏ॥ గు సా5-45 ఉషాప2-18 వసా6-26 మొ8-7కు కన్య భో°7-56 |
| 17 | ద్వా॥ శు సా6-26 శ్రప3-30 వరా7-54 మొ9-24కు భో°7-52 |
| 18 | త్ర॥ శ సా6-39 ధసా4-34 వరా11-48 మొ1-25కు భో°7-48 |
| 19 | చతు॥ ఆ సా6-18 శసా4-56 వరా11-13 మొ12-49కు భో°7-44 అనంతవ్రతము |
| 20 | పూ ○ సో సా5-30 పూభాసా4-52 వతె2-10 మొ3-44 భో°7-40 |
| 21 | బ॥ పా మం సా4-14ఉభాసా4-20 వరా3-48 మొ5-20కు భో°7-36 |
| 22 | వి॥ బు సా2-36 రేసా3-21 వర్జంలేదు ఉండ్రాళ్లతద్ది భో°7-32 తిథిద్వయం |
| 23 | త॥ గు ప12-40 అశ్వప2-12 వప10-24 మొ11-55కు వరా11-11 మొ12-41కు భో°7-28 |
| 24 | చ॥ శు ఉ10-30 భ11-46 రా11-56 మొ1-26కు భో°7-24 |
| 25 | పం॥ శ ఉ8-11 కృత్తితె5-46 కృప11-11 వరా2-3 మొ3-32కు భో°7-20 |
| 26 | ష॥ ఆ తె3-19 రోఉ9-30 వసా2-43 మొ4-12కు భో°7-16 |
| 27 | స॥ సో రా1-57 మృఉ7-50 వసా3-41 మొ5-11కు భో°7-13 |
| 28 | అ॥ మం రా10-46 ఆర్ద్రఉ6-18 పునతె4-50 వసా5-33 మొ7-3కు భో°7-10 |
| 29 | న॥ బు రా8-51 పుష్యతె3-42 వప12-27 మొ1-59కు భో°7-6 |
| 30 | ద॥ గు రా7-12 ఆశ్లేరా2-51 వసా4-4 మొ5-35కు భో°7-2 |

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠరైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొనవలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1-వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసెంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసెంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టంబరు |
| డిసెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసెంబరు |
| సెప్టంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | అక్టోబరు |

# "గృహలక్ష్మి"

మద్రాస్ రోహిణీ పిక్చర్సు లిమిటెడ్ వారి తెలుగుటాకీ "గృహలక్ష్మి" షూటింగ్ చాలాచురుకుగా జరుగుతూవుంది. ఇంతవరకు మూడోవంతు చిత్రము తయారయింది. అవుట్ డోర్ దృశ్యాలన్నీ పూర్తిఆయినయి. ఇన్ డోర్ షూటింగ్ జరుగుతూవుంది. ఇప్పటికి తీసిన దృశ్యాలనుబట్టి ఈ చిత్రానికి తెలుగుచిత్రాలలో ఒక వైలక్షణ్యం కలిగించాలని సాంకేతిక శాస్త్రజ్ఞులు తీవ్రదీక్షతో పనిచేస్తున్నట్టు బోధపడుతుంది. మాధురి అనేనాట్యకర్తె కథానాయకుడి నాట్యాభిమానాన్ని పురస్కరించుకొని కిడ్నాపణ్ని చేసుకోవడానికి ఆసుపత్రికివెళ్లి అక్కడ డాక్టరును మోహపెట్టుతుంది. ఈఘట్టంలో తయారుచేసిన హాస్పిటలూ, అందులో డాక్టరు, నటీపాత్రలను ధరించిన శ్రీరామానుజాచార్యులు మిస్ కాంచనమాల గార్ల అభినయము చాలా ముద్దుగావున్నయి. అసలు ఆస్పత్రిలోని వాతావరణం కళ్లకు కట్టేలాగు ఆసెట్టింగ్ అమర్చారు. నూరుమందికిపైగా ఎక్ స్ట్రాలూ, నర్సులూ దానిలో పాల్గొన్నారు. అవుట్ డోర్ దృశ్యాలన్నీ సహజశోభతో చిత్రసౌభాగ్యానికి వన్నెపెట్టుతూవున్నవి. సాంఘిక చిత్రాలలో పాల్గొనడానికిదే మొదలైనా కన్నాంబగారి రాధాపాత్రాభినయం ప్రశస్తంగావుంది. సంగీతం ముద్దులొలుకుతూ తెలుగువారికి క్రొత్తచవులు చూపిస్తోంది. వీరీ చిత్రాన్ని చాలా తొందరలోనే విడుదలచేయడానికి ప్రయత్నిస్తున్నట్టు వింటున్నాము.

(ఒక విలేఖరి.)

---





ప్రకాశంగారి మిశ్రమ బంగారు ఆభరణాలు

పది సంవత్సరములు గ్యారంటి గలది.

## చౌక ! శాశ్వతము !! గట్టి వన్నె !!!

చౌకబేరముతో డబ్బు మిగుల్చుకొన గోరుదురా!

"నారీరత్నములు ధరించుటకు అందమైనది

సౌందర్యములను పెంపొందించునది."

ఎరుపు, ఆకుపచ్చ, నీలము, సప్తవన్నె, లేక ఇవన్నియుకలసిన రంగులరాళ్లను పొదిగిన ప్రకాశరగు హారములను గొనుడి. అభిరుచి ననుసరించి హారములను కావలసిన రంగులో తయారుచేసి యివ్వబడును.

పలురకముల గాజులు, ఇతరహారములు, ఒడ్డాణములు మొదలగునవి మావద్దదొరుకును.

(ఉచితముగా నివ్వబడు మా 1937 వ సంవత్సరపు కేటలాగుకు వ్రాయుడు.)

## ఆర్. ఎస్. ప్రకాశం అండుకో

అలాయ్ గోల్డు జ్యువెలర్సు,

187, చైనాబజారురోడ్డు, మదరాసు.



# "గృహలక్ష్మి"

తెలుగు పిల్లలకు తీరులు దిద్దే

సాంఘిక చిత్రము

మామూలు భాషతో మధురగానముతో మనస్సును కరగించి
మహదాశయములను వెల్లడిచేయనున్నది.



గృహలక్ష్మి

ముఖ్య నటీ నటులు

| | | |
|---|---|---|
| శ్రీమతి | కన్నాంబ | యం. రామానుజాచార్యులు |
| ,, | కాంచనమాల | చిత్తూరి. నాగయ్య |
| ,, | కాంతామణి | గౌరీపతిశాస్త్రి |
| ,, | కమలకుమారి | మొదలగువారు. |

# బాలయోగిని

దక్షిణహిందూస్థానమును అద్భుతాశ్చర్యములందు ముంచిన సన్నివేశములు

తమిళటాకీగా అతిప్రఖ్యాతిగాంచిన ఫిల్మురాజము

తెలుగుటాకీగా అంతకంటె ప్రతిష్ఠగడించనున్నది

నటీనటశిఖామణులు

బేబి సరోజ

మిస్ కమలకుమారి

మిస్ సుందరమ్మ

మిస్ వరలక్ష్మి

మిస్ నగరాజకుమారి

ఆరణి సత్యనారాయణగారు

వి. వి. రావుగారు

ఉచితజ్ఞులు:

డైరెక్టర్

కే. సుబ్రహ్మణ్యంగారు B.A. B.L.

గూడవల్లి రామబ్రహ్మంగారు

సంగీతడైరెక్టర్

మోతి బాబుగారు

మారుతి సీతారామయ్యగారు

ఫోటోగ్రఫి

K. ఓమల్ ఘోష్‌గారు

P. E. నాయక్‌గారు

ఆడియోగ్రాఫి

P. K. విశ్వనాథ్‌గారు

స్టూడియో

ది మోషన్ పిక్చర్ ప్రొడ్యూసర్స్ కంబైన్ లిమిటెడ్

మఱవకుము! ఇది మద్రాసు యునైటెడ్ ఆర్టిస్ట్స్‌వారు తయారుచేయునది

బుక్కింగుకు ఈక్రింది చిరునామాకు వ్రాయుడు:

## ది మద్రాసు యునైటెడ్ ఆర్టిస్ట్స్ కార్పొరేషన్,

7, జెల్‌నరోడ్డు, ట్రిప్లికేన్, మద్రాసు.

టెల్లిగ్రామ్ "నవీన",

టెలిఫోన్ నెం. 8487

గృహలక్ష్మి

చంద్రమతి—ద్రౌపది—కమలపాత్రలను ధరించి ప్రఖ్యాతిగన్న శ్రీమతి కన్నాంబ "గృహలక్ష్మి" చిత్రములో రాధపాత్రను ధరించినది.

# గృహలక్ష్మి అనుబంధము



## నూతనభవన ప్రారంభోత్సవము

ఆగస్టు 21 వ తేది శనివారము సాయంకాలము 5-30 గంటలకు రాయపేటయందు నిర్మింపబడిన 'కేసరికుటీరము' యొక్క నూతనభవన ప్రారంభోత్సవము జరుపుటకు మహారాజరాజశ్రీ దివానుబహదూరు సర్ అల్లాడి కృష్ణస్వామయ్యగారి యధ్యక్షత క్రింద నూతనభవనమునందలి ప్రథమహాలునందు సభ జరిగెను. శ్రీయుతులు గా॥ బులుసు సాంబమూర్తిగారు, గా॥ జస్టిసు సర్ వెంకటసుబ్బారావుగారు, గా॥ యు. రామరావుగారు, గా॥ వెంకటస్వామి నాయుడుగారు, దివానుబహదూరు భాష్యం అయ్యంగారు, ఎన్. వి. రాఘవన్ గారు, రామదాసు పంతులుగారు, గంటి లక్ష్మన్న గారు మొదలగు 600మంది పురప్రముఖులైన స్త్రీపురుషులు పెక్కండ్రు సభ కరుదెంచిరి. నూతనభవనముపై జాతీయపతాకము ఠీవిగ నెగురుచు చూపరుల కెంతయు నానందదాయకముగ నుండెను. కేసరికుటీరము తచ్ఛాఖోద్యోగులెల్లరు తెల్లని ఖద్దరువస్త్రముల ధరించి యతిథిసత్కారములందు నిమగ్నులై యుండిరి.

శ్రీమతి బెంగుళూరు నాగరత్నముగారి ప్రార్థనతో సభా ప్రారంభమయ్యెను. ఈ ఉద్యమమునకు విజయముగోరుచు ప్రారంభోత్సవమునకు రాజాలక ఆరోగ్యశాఖ మంత్రిగారగు గా॥ టి. ఎస్. ఎస్. రాజను గా॥ మునుస్వామిపిళ్లె, గా॥ రామక్ మీనన్, మైసూరుమహారాజుగారి సెక్రెటరీ తంబుశెట్టి మొదలగు ప్రముఖులవద్దనుండివచ్చిన అభినందనములును, ఆశీస్సులును చదువబడెను. ఈసమయమున 'గృహలక్ష్మి' నభినందించుచు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు పంపిన సందేశముకూడ చదువబడెను.

తరువాత సభికుల నాహ్వానించుచు శ్రీయుత డాక్టరు కేసరిగా రిట్లుపన్యసించిరి.

"సోదరీ సోదరులారా!

మిమ్ముల నందఱిని హృదయపూర్వకముగ నాహ్వానించుచు, మీరందఱు నేటి సాయంకాలమున జరుగు ప్రారంభోత్సవమున కరుదెంచినందుకు కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

37 సంవత్సరముల క్రింద నేను మాసమునకు రు. 1-6-0 వంతున అద్దెకున్న యింటికి

'కేసరికుటీర' మను పేరిడి, 15 రూపాయల భించిన కొలదిసంవత్సరములలోననే నేను
పెట్టుబడితో నీ పరిశ్రమను ప్రారంభించితిని. తయారుచేసిన పెక్కు ఔషధము లు
పలుకష్టములకు లోనైన యీ ప్రారంభ జనాదరణపొందెను. వానిలో 'లోధ్ర',
కాలములో నన్నెంతయు నుత్సాహపర 'అమృత', 'అర్క'అను రత్నత్రయము అఖిల



నూతన భవన ప్రారంభోత్సవము

ఎడమనుండి కుడివైపుకు: గంటి లక్ష్మన్నపంతులుగారు, ఆద్దేపల్లి సూర్యనారాయణగారు,
ఎస్. సాంబయ్యగారు, దివాన్ బహదూర్ సర్ అల్లాడి కృష్ణస్వామయ్యగారు (అధ్యక్షులు),
వే. రామదాసుపంతులుగారు, వి. రాధాకృష్ణయ్యగారు, డాక్టరు కే. ఎస్. కేసరిగారు.

చుచు, నాకు సాయపడిన నా మిత్రులను భారతదేశమందును, బర్మాయందునేగాక
నే నెపుడును మరువజాలను. నా పరిశ్రమ విదేశములందును వ్యాపించి వాని వ్యాపా
మొదటినుండియే యుత్సాహకరముగనుండి రము వృద్ధియయ్యెను. నే నౌషధముల
క్రమముగా నభివృద్ధిపొందసాగెను. ప్రారం తయారుచేయుటలో నెపుడును శాస్త్రోక్త

మగు పద్ధతులనే యవలంభించితిని; కాని ఆధునిక శాస్త్రపద్ధతులనుగూడ సాయము గొంటిని. ఈవిధముగ విదేశములందు తయారగు పెక్కు ఔషధములకు సరియగువానిని తయారు చేయగలిగితిని.

గావించి వారికి మరింత సేవచేయవలయు ననెడి యుత్సాహము నినుమడింపజేసినది.

పది సంవత్సరములక్రిందట స్త్రీల ఆరోగ్యాభ్యుదయముల పెంపొందించి, విజ్ఞాన మెక్కుడు గావించి, సాంఘికోన్నతి కలిగించు



ప్రా రం భో త్స వా నం త ర ము

శ్రీయుతులు డాక్టరు కె. ఎస్. కేసరిగారు, అధ్యక్షులు, గా॥ బులుసు సాంబమూర్తిగారు, వి. రామదాసుపంతులు మొదలగువారు ఫలాహార మారగించుట.

'లోధ్ర' గడించిన ప్రజాదరణ, విజయము, భారతీయస్త్రీలకు మహోన్నత సేవజేయింప నా కవకాశము కలిగించినవి. అంతియగాక అది నా దృష్టిని విశాలము నుద్దేశముతో 'గృహలక్ష్మి' అను తెలుగు మాసపత్రికను స్థాపించితిని. ఈపత్రిక పది సంవత్సరములుగా పొందిన యాదరణ, మన్నవలే నన్నింకొక పత్రికనుగూడ ప్రారం

భింప నుత్సహించినవి. ఈ సంవత్సరారంభ మునుండి పైయుద్దేశములతోడనే 'గృహ లక్ష్మి' యనుపేరనే తమిళము (అరవము) నందుకూడ మాసపత్రిక వెలువరించితిని. అదియు తన తెనుగుసోదరివలెనే దినదినాభి వృద్ధి పొందుచున్నది.



కేసరికుటీరం – రాయపేట, మద్రాసు.

ఇటువంటి ప్రయత్నములతోడను, వ్యాపారమునకు పరిశ్రమకు సంబంధించిన ప్రకటనాది కార్యముల యొత్తిడిచేతను ముద్ర ణాలయము స్థాపింపకుండుట సాధ్యము గానిదయ్యెను. అందుచే 1927 వ సంవత్సర మున 'లోధ్ర ముద్రణాలయము' అనుపేర నొక ముద్రణాలయము స్థాపించితిని.

ఈ పరిశ్రమకు, దీనికి సంబంధించిన యితర శాఖలకు తగిన వసతిగల చోటు కొన్ని సంవత్సరములవఱకొక ప్రబల సమ స్యయైయుండెను. ఎగ్మూరునందున్న కర్మా గారమునకు తోడు టాయిలెట్స్ తయారు చేయుటకు బెంగుళూరునం దొక కర్మాగార మును, శాస్త్రోక్తమగు మూలికలు సులభ ముగా, యథేచ్ఛముగా దొరకుటచేత తైలములు, వనౌషధులతో ఔషధములను చేయుటకు తిరుచూరు (కొచ్చినురాజ్య మున) నందొక కర్మాగారమును నిర్మించితిని. ఇవన్నియు నొకేచోటనుండిన నెంతయో బాగుండెడిది; అదియే నివాసమైనచో ప్రతి

విషయమును స్వయముగ గమనింప వీలుం డును. ఇవి యెట్టుల సమకూరునోయని చాల కాలమునుండి యోచించుచునేయుంటిని.

నేడు ప్రారంభోత్సవము జరుపబడనున్న యీభవనము పైయాశయముల కెల్ల యను గుణముగా పరిశ్రమయంతయు స్వయముగ చూచుకొనుట కనుకూలముగ నిర్మింప బడినది.

ఈభవనము గత అక్టోబరు మాసము నందు ప్రారంభింపబడినది. దీనిని త్వరగా ముగించుటకు ప్రత్యేక శ్రద్ధవహించిన కంట్రాక్టరు కె. రత్నంగారికి హృదయపూ ర్వకవందనము లర్పించుచున్నాను.

స్వీయచరిత్రనుగూర్చి యిట ముచ్చ టించినందులకు సభికులు క్షమింతురుగాక. మన యువతీయువకుల కొరకు సందేశమిచ్చు తలంపుతోడనే నే నిట్టుల గావించితిని జీవితపథమున దేనియందుగాని విజయము బొంద దలంచువారు స్వశక్తిపై పూర్తిగ నాధారపడి, తాము చేపట్టిన పరిశ్రమ యందు లీనమైపోవలయును. వినిర్మల హృదయముతో గావింపబడిన యే కృషి యైనను సహృదయుల మన్ననలగొని ప్రజా దరణబొంది సత్ఫలముల నొసంగకపోదు. ఈవిషయమును మన యువతీయువకులు చక్కగ పరిశీలించెదరుగాక.

'కేసరికుటీరము'యొక్క నూతనభవన ప్రారంభోత్సవము జరుపుటకై తమకున్న కార్యభారమును గమనింపక ఈతరుణమున నిచటికివిచ్చేసిన శ్రీయుత దివాన్ బహదూర్ సర్ అల్లాడి కృష్ణస్వామయ్యగారికి నేను కృతజ్ఞతను సరిగా వెల్లడింప జాలకున్నాను.



కేసరికుటీరం — తేనాంపేట.

వారు సంతసముతో నాహ్వానము నంగీకరించి వచ్చుటచేతను, మీరంద ఱరుదెంచుటచేతను నా కమితానందము గలుగుచున్నది. ఈ మీరాక నిస్సందేహముగా నేను చేయగల సాంఘికసేవ కమితోత్సాహముగలిగించునని నమ్ముచున్నాడను.”

ఉపన్యాసానంతరము డాక్టరు కేసరిగారు నూతన భవనమును నతిత్వరగా, నిపుణము నిర్మించుట కమితశ్రద్ధజూపిన కంట్రాక్టరు కె. రత్నంగారికొక బంగారుపతకమును బహూకరించిరి. తదనంతరము కాంగ్రెసుకు రూ. 116 లును, మద్రాసు సేవాసదనమునకు రూ. 116 లును, అవ్వాయి హోమునకు (అనాథబాలికాలయము) రూ. 116 లును, హరిజనసేవాసంఘమునకు రూ. 50 లును, కూడ నొసగిరి. కాంగ్రెసుపక్షమున, గౌ. బులుసు సాంబమూర్తిగారును, సేవాసదనముపక్షమున గౌ. న్యా. వెంకటసుబ్బారావుగారును, అవ్వాయిహోముపక్షమున డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారును, హరిజనసేవాసంఘపక్షమున దివానుబహదూరు వి. భాష్యంఅయ్యంగారును పైమొత్తముల స్వీకరించిరి.

కరతాళధ్వనులు చెలరేగుచుండ దివాన్ బహదూరు సర్ అల్లాడి కృష్ణస్వామయ్యగారిట్లుపన్యసించిరి.

“సోదరసోదరీమణులారా!

ఈ సాయంకాలము జరుగు మహోత్సవములో నేను పాల్గొనవలయునని డాక్టరు కేసరిగారు నన్ను కోరినపుడు కార్యభారమును సరిగా నిర్వహింపగలుగుదునా యని మొదట సుంతజంకు గల్గెను; కాని మేమిరువురము నెల్లూరు మండలమునకు చేరిన వారమను విషయము స్మరణకు దెచ్చుకొని ఆనందభరితుడనై యీ యుత్సవమున పాల్గొన నిశ్చయించుకొంటిని. మేమిరువురమును ధనాభావముతో జీవితము నారంభించి మా గోళములలో నెటులో ప్రాముఖ్యమునకు వచ్చినాము. శ్రీ కేసరిగారు పదునైదు రూప్యములతో తనజీవితము నారంభించిరి. నేనో అదియును లేక త్రోపుడు నిల్వ (Minus balance) తో నా జీవితమును బ్రారంభించితిని.

ఈ సంస్థను గుఱించిన విశేషమొండు గలదు. అందఱును సాంఘిక పరిస్థితుల నారయుచు ఆర్థిక సౌభాగ్యమును చేకూర్చుటకు వాంఛించుచుండగా నీ సంస్థ ధనవిభాగముపై దృష్టియుంచినది. పశ్చిమఖండములందు నూనెలు, ఓడలు, ఇనుము—వీని వ్యాపారములవల్ల కోటీశ్వరులైన వారనేకులున్నారు. ఈవిధముగనే కొందఱు బొంబాయిలో మహాధనికులయిరి యని మనము వినుచున్నాము; కాని మనప్రాంతములలో వ్యాపారమువలన బాగుగ ధనము గడించినవారు ఈరాష్ట్రమున నెందఱో లేరు. తమ వ్యాపారమున ఏకైక దృష్టిపఱిపి ప్రాచీన ఓషధులందలి నమ్మకమువల్ల నీ‘కుటీరము’ను వీరు స్థాపించినారు. ఒకటి పలుకుబడిగల సంస్థయైనయెడల—ఒండు, రెండుసంవత్సరము

లుగ గాదు; సంవత్సరములాదిగ నేఁటిసంస్థ ప్రస్తుతోన్నతస్థితికి వచ్చినయెడల దానివల్ల నెట్టి తాత్పర్యము గ్రహింపవలెను? ప్రజల కూరక శ్రీ కేసరిగారి మీఁదగల నమ్మిక గాదు దాని నట్టి అభివృద్ధికి తెచ్చినది; కాని వారు తయారుచేయు ఔషధరాజములు రోగముల నివారించి వేలకొలఁది రోగుల

కావున నెవరుగాని ధైర్యసాహసములద్వారా నార్జించిన ధనముపై సంఘమున కధికార ముండును. డాక్టరు కేసరిగారిని బాగుగ నెఱిగినవారు, నెల్లూరు, మద్రాసులందుండు పెక్కు సంస్థల నెట్లు పోషించిరో చెప్పగలరు. సాధారణముగా వారివద్ద చెయిచాచి లేదని పించుకొన్నవారు 'నభూతో నభవిష్యతిః.'



కేసరికుటీరం — తిరుచూరు.

కత్యంతసుఖము గూర్చుచున్నదియును పరమ సత్యము. స్వయంకృషివల్ల నే వ్యక్తియైన నున్నతదశకు రావచ్చునను సూత్రమున పరిపూర్ణమైన విశ్వాసము శ్రీ కేసరిగారికి గలదు. అట్లే నాయభిప్రాయమున మన పరిసరములు మనము మెలగు సంఘము-ఇవి మన ప్రవర్తనలకు మిగుల తోడ్పడుచున్నవి;

ప్రస్తుత సాంఘికవ్యవస్థ సరిగాలేదని నిరసించు వారమైనకూడ, దానధర్మపరులగు శ్రీ కేసరిగారివంటి వారు ధనాఢ్యులగుటలో ఈర్ష్యపడము. వారు తమ వ్యాపారములో బాగుగా విజయము బడయవలయుననియే మనయెల్లర ప్రార్థన. ఏలన వారికి విజయము కలుగుకొలఁది సేవాసదనము, కాంగ్రెసు,

ఇట్టి దేశసేవాపరాయణ నిమగ్నములగు నితర సంస్థలు, ఇంతకంటె నెక్కుడు ధనము పొందగలవు. హిందూసంఘ మున్నతదశకు వచ్చుటకై వలయుసహాయమునకు అధఃపతితుల యుద్ధరణమునకు శ్రీ కేసరిగారిని నిరతము విశ్వసింపవచ్చును. మీరందఱు నాహ్వానము నంగీకరించి యిట కరుదెంచుట నాకు నెంతో యానందముగనున్నది. అనేక సంస్థలకు సంఘములకు వ్యాపారములకు జెందినవార లిచటనున్నారు.

సంఘములోని ఒక్కొక్క శాఖయు నిందు సభ్యత నిలుపుకొనుటకు కారణము ఈసంస్థ యొక్క చక్కని పలుకుబడియనియు, నీ ఔషధముల ప్రాముఖ్యమనియు చెప్పక చెప్పగలవు.

ఈ 'కేసరికుటీరము' యొక్క ప్రారంభోత్సవము జరుపుటకు నాకు మిక్కిలి యాహ్లాదముగ నున్నది."

నూతన భవనముల తెఱచుటతోడనే సభికులందఱికి ఫలాహారపు విందొసగబడెను. సభికులందఱు ఇష్టాగోష్ఠిని ఫలాహారమును ముగించి శ్రీమతి బెంగుళూరి నాగరత్నంగారి గాన మాధురిని చవిచూచిరి. తదుపరి సభికులందఱు ఇంటికేగుతరి పురుషులకు తెల్లని ఖద్దరుసంచులలో కేసరి డెంటల్ క్రీమును, ఫలతాంబూలములును ఇయ్యబడెను. స్త్రీలందఱికి కేసరి కుంతలకాంతి తైలమును, ఫల పుష్పతాంబూలములు వైచిన కేసరి వర్ణపు ఖద్దరుసంచు లియ్యబడెను.

మరుదినము—22 వ తేది ఆదివారము—ప్రారంభోత్సవమునందు పాల్గొన్న ప్రముఖులందఱు నూతన భవనమునందు విందునకాహ్వానింపబడిరి. ప్రారంభోత్సవమందలి ప్రతికార్య కలాపమునందును, కేసరికుటీర మండలి యుద్యోగులు, కర్మాగారమందలి కూలివారలు సైతము ఇతరులందఱితో బాటు భోజనాదిసత్కారములు సరిసమానముగా పొందు టెల్లఱికి ఆనందకరముగ నుండెను.

మ. సతతానేకమునీంద్రబృందకృతపూజావందనం జందనా
గత మందానిల కందళీకృత తరంగస్యందనన్ దీరసం
గత మాకంద మరందబిందు సహితార్కస్యందనం గాంచిర
య్యాతు లింపొంద గవేరనందనఁ ద్రిలోకానందనానందనన్.

క. కని తదవేక్షణలోలత, ననిమిషవహించి యద్భుతానందంబుల్
మనమున బిరిఁగొనఁ బులకిత, తనులై ప్రణమిల్లి భక్తితాత్పర్యములన్.

సీ. గురుధర్మ చరితానుకూలంబు కూలంబు, సంక్షాళితాఘకజ్జలము జలము,
ఘనముక్తి నృత్తరంగములు తరంగములు, వినీతకుజనభైరవము రవము,
విహతతాపత్ర యోద్వేగంబు వేగంబు, లలితభక్తానందలహరి లహరి,
కుశల ప్రశంసానుగుణములు కణములు, విధ్వస్త దుర్భవవీచి వీచి,
నిరుపమజ్ఞాన సంపద నెఱవు నెఱవు, భరితబహు మోహపటలిబోనులువునులువు
గాన నెనగాన మీనదితో సనూన, మహిమరహికెక్క తీర్థసమాజములను.

శ్రీరంగమాహాత్మ్యము.